# ఎవరిది నేరం?

రచన:

డా॥ సి. హెచ్. వెంకటేశ్వరరావు



# ఎవరిది నేరం?

[ నాటకం ]



రచన

డా॥ సి. హెచ్. వెంకటేశ్వరరావు.



ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ-2.

3 20-2-74

# అంకితం

భారత రథసారథి- రాజకీయవేత్త - వేదాంతి - తత్వవేత్త - చరిత్ర కారుడు - రచయిత - విద్యావేత్త - జాతీయ వీరుడు అయిన "భారతరత్న" బిరుదాంకిత స్వర్గీయ శ్రీ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారికి నా హృదయ పూర్వకముగా అంకిత మొనరించుచున్నాను.

- రచయిత

# గమనిక

ఈ నాటకంలోని సంభాషణలుగాని, సంఘటనలుగాని, పాటలుగాని ఎవ్వరునూ రచయిత అనుమతి లేనిదే ఉపయోగించుకొనరాదు మరియు మార్చరాదు. దీనిని ఉల్లంఘించిన వారిపై క్రిమినల్ చర్యలు తీసుకొనబడును. ఈ నాటకం యొక్క ప్రింటింగ్ పబ్లిషింగ్ హక్కులు ఆదర్శ గ్రంథమండలి విజయవాడ వారివి.

ఈ నాటకమును ప్రదర్శించుటకు కళాకారులు రచయితనైన నా అనుమతికి జంటకార్డు వ్రాసి అనుమతి పొందుట కళాకారులకు ఒక చిన్న మర్యాద. ఈ క్రింది అడ్రసుకు జంటకార్డు వ్రాసి అనుమతి పొందవలయును.

రచయిత
డా॥ సి. హెచ్. వెంకటేశ్వరరావు.
కస్తూరిబాయిపేట, విజయవాడ-2.

5 TPLA101BJ04

# పాత్రల పరిచయం

1. భాస్కర్:- నారాయణరావుగారి పుత్రుడు. బాగా చదువుకున్న వాడు. (వయస్సు 25 సం॥)

2. ప్రసాద్:- సరోజయొక్క అన్నయ్య. భాస్కర్ బావమరది. విద్యావంతుడు. భార్యపోయింది. చెల్లెలే తనప్రాణమని తలుస్తాడు. (వయస్సు 28 సం॥)

3. డాక్టర్:- ప్రసాద్‌యొక్క ముఖ్య స్నేహితుడు మరియు అతని ఫ్యామిలీ డాక్టర్. జీవితంలో ఎన్నో ఎదురుదెబ్బలు తిన్నవాడు. ఏకాకి సరోజ అంటే పంచప్రాణాలు. (వయస్సు 30 సం॥)

4. రామారావు:- నారాయణరావుగారి పార్ట్నర్. భాస్కర్ స్నేహితుడుగా ఉండి వారి కుటుంబానికే ద్రోహం తలపెట్టిన పరమనీచుడు. (వయస్సు 30 సం॥)

5. నారాయణరావు:- భాస్కర్ తండ్రి. డబ్బుఅంటే ఆశ, కుమారుడంటే పంచప్రాణాలు. (వయస్సు 50 సం॥)

6 పరమానందం.- నారాయణరావుగారి మేనేజరు. ఏవో సాకులు చెప్పి జీతంకంటె అడ్వాన్సు ఎక్కువ తీసుకుంటూ వుంటాడు. (వయస్సు 35 సం॥)

7. రాజారావు:- ఈయన ఒక జమిందారు. ఒక్కతే కూతురు. కూతురు సంబంధము గురించి నారాయణరావుగారి దగ్గరకు వస్తూవుంటాడు. (వయస్సు 45 సం॥)

8. సుబ్బన్న:- నారాయణరావుగారి ఇంటి నౌకరు. వారన్నా వారి కుటుంబమన్నా ఎంతో అభిమానం. (వయస్సు 55 సం )

9. జ్యోతిష్యుడు:- ఈయన ఒకపూజారి. (వయస్సు 35 లేక 40 సం॥)

10 సరోజ:- కాలేజీ గరల్. భాస్కర్‌ను ప్రేమించి పెళ్ళి చేసుకుంటుంది, పేదలంటే మహా అభిమానం. (వయస్సు 19 సం॥)

# నా⁝మనవి

నాకు చిన్న వయస్సునుండి కూడా కళ అంటె చాలా అభిమానం. నాకు నాటకములలో నటించటం అనుభవము ఉంది కాని రచించటంలో అనుభవంలేదు. ఇదియే తొలిసారి. ఈ నాటకములో ఏవయినా తప్పులున్నయెడల ఒప్పులుగా భావించి నన్ను మన్నించ ప్రార్థన.

ముఖ్యముగా ఈ "ఎవరిది నేరం?" అనే నాటకము నేను వ్రాయుటకు ప్రోత్సహించిన నా ప్రియమిత్రుడు జి. వి. రాఘవ రెడ్డిగారికి నా కృతజ్ఞతాభి వందనము లర్పించుచున్నాను. నన్ను వృద్ధిలోకి తీసుకువచ్చిన నా మాతృదేవి శ్రీ చాగంటి పాటి తులశమ్మగారికి మరియు నా పితృదేవులు శ్రీ చాగంటి పాటి కోటేశ్వరరావుగారికి ప్రణామము లర్పించుచున్నాను.

- రచయిత

ఈ నాటకమును ప్రప్రథమంగా శ్రీ వెలిదండ్ల హనుమంత రాయ గ్రంథాలయములో పట్టణ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ జి. యస్. రాజుగారి అధ్యక్షతన శ్రీనివాసకళాసమితి, విజయ వాడవారు ప్రదర్శించారు.

నటీ నటవర్గం మరియు సాంకేతిక నిపుణులు.

భాస్కర్:- డి. శశికళాధరరావు

డాక్టర్:- పి. రాజరత్నం

ప్రసాద్:- జి. దుర్గారావు

రామారావు:- జి. వి. రాఘవరెడ్డి

నారాయణరావు:- ఆర్. వెంకటేశ్వరరావు

రాజారావు:- యస్. సత్యనారాయణ

పరమానందం:- యస్. స్వతంత్రరావు

సుబ్బన్న:- పి. దుర్గాప్రసాద్

జ్యోతిష్యుడు:- యమ్. ప్రభాకర్

సరోజ:- కుమారి కె. రమ

సంగీతం
వి. యస్. నారాయణమూర్తి

ప్లేబాక్
V. S. N. మూర్తి &
శ్రీమతి జ్యోతికుమారి

ఆర్కెస్ట్రా
కె. యస్. ఆర్. అంజనేయులుశాస్త్రీ.

వీణ:- కె. ప్రసాద్‌బాబు

వైయొలిన్:- జి. గణేష్

క్లార్‌నెట్, ఫ్లూటు, షహనాయ్ } సి. హెచ్. అప్పారావు.

తబలా అండ్ డోలక్:- మాష్టర్ శేఖర్

వెరైటీస్:- కె. వి. దుర్గాప్రసాద్

దర్శకత్వం
డా॥ సి. హెచ్. వెంకటేశ్వరరావు

నిర్వహణ
జి. వి. రాఘవరెడ్డి.

# ఎవరిది నేరం?

(తెరలేచేసరికి భాస్కర్ తండ్రి నారాయణరావుగారు చుట్టకాలుస్తూ సోఫాలో కూర్చుంటాడు. సిల్కులాల్చి. గ్లాస్కో పంచిపైన కండువ, కోరమీసము, నిండైన విగ్రహాము చేతిలో హాండ్‌స్టిక్ ఉంటుంది.)

నారా: (కూర్చుని చుట్టకాలుస్తూ పేపరు చూస్తూ, ఉంటాడు.) సుబ్బన్నా.........సుబ్బన్నా

సుబ్బ : (లోపలినుంచివస్తూ) వత్తున్నాను బాబుగోరు.........ఏంటి అయ్యగోరు పిలిచారు.

నారా : (పేపరుదించి) నా బ్యాగ్ తీసుకురా (సుబ్బన్న లోపలికి వెడతాడు.)

సుబ్బ : (లోపలినుంచి వస్తూ) ఇదిగోండయ్యగోరు.

నారా : (బ్యాగ్‌తీసుకొని) నేను ఇప్పుడే అలా బ్యాంక్‌కు వెళ్ళి వస్తాను. (అని వెళుతూ వెనక్కితిరిగి) ఇదిగో చూడుసుబ్బన్నా ఈవేళ రాజారావుగారు వస్తారు. వస్తే వారిని ఉండమను. ఇప్పుడే వస్తాను. వాటిని కొంచము జాగ్రత్తగాచూడు. (అని వెళతాడు.)

సుబ్బ : అలాగే బాబు (అని అక్కడ కేబులు తుడుస్తూంటాడు.)

(ఇంతలో భాస్కర్ బయటనుండి వస్తాడు.)

భాస్క: సుబ్బన్నా నాన్న ఎక్కడికి వెళుతున్నారు? కొంపతీసి రాజారావుగారి యింటికా్కదుకదా?

సుబ్బ: బేంక్ కి చినబాబు. రాజారావుగోరు వస్తారంటవత్తేవుండమని శెప్పమన్నారండి.

భాస్క: ఆఁ.......ఇక్కడకు వస్తాడూ? ఓరి వీడు తగలడ. వీడ నాకు మొగుడై కూర్చున్నాడే?

సుబ్బ: ఏటి చినబాబుగోరు అలా అంటూరు?

భాస్క: ఏమిలేదు. ఈయనగార్కి ఒకకూతురు తగులడింది. ఆ అమ్మాయిని నా మెడకు కట్టాలని నాన్నచుట్టు తిరుగుతున్నాడు.

సుబ్బ: (సంతోషముతో) మంచిదేగా చినబాబుగోరు. నేనుబుల్లెమ్మగోరు ఎప్పుడు వత్తుందా అని సూత్తున్నాను.

భాస్క: ఆ అమ్మాయిని ఎవరు చేసుకుంటారు?

సుబ్బ: ఏటి చినబాబు అలా అంటారు, లచ్చాధికారు లటుండి.

భాస్క: నీకూ డబ్బు ఆశపుట్టిందే. అది సరేకాని (మెల్లగా) రాజారావుగారు వస్తారుకదూ! ఆయన వచ్చేలోపులో మనము ఎక్కైన చెక్కేస్తే రైటు (బిగ్గరగా) ఆఁ! నేను వస్తాను. నాన్న అడిగితే ఎవరోస్నేహితుడువచ్చి తీసుకొని వెళ్ళేరని చెప్పు.

సుబ్బ: అలాగే చినబాబు (అని డ్రాయరు, కుర్చీలు తుడుస్తుంటాడు. ఇంతలో రాజారావుగారు పొడుగుగా, సన్నగా సిల్కులాల్చి పంచ వేనుకొని మంచి జమిందారు మీసము. చేతిలో స్టిక్ ఉంటుంది.)

(రాజారావుగారు ప్రవేశము)

రాజా: ఇదిగో నారాయణరావుగారున్నారా ?

సుబ్బ : లేరండీ అలా యిప్పుడే బాంక్‌కు వెళ్ళేరు.

రాజా: అరె ఎప్పుడొస్తారో ఏమో. వస్తే రాజారావుగారు వచ్చారని చెప్పు.

సుబ్బ: (ఆదుర్దాగా) రాజారావుగోరా! అమరేనండయ్యా. అయ్యగోరు బేంక్‌కు వెళ్ళేరు. తముర్ని ఉండమన్నారుండయ్యా, కూరోచ్చండయ్యా (అని సోఫా చూపిస్తాడు.)

రాజా: సరే (అని కూర్చుంటు సిగరెట్ వెలిగిస్తాడు.)

సుబ్బ : (లోపలికి వెళ్ళి ఒవల్టిన్ తీసికొస్తూ) ఓల్టేను తీసుకోండి అయ్యగోరు.

రాజా: ఇప్పుడేమివద్దు.

సుబ్బ : అయ్యగోరు మీరు తీసికోపోతె నన్నుతిడతారు. తముర్ని అయ్యగోరు జాగ్రత్తగా చూడమన్నారుబాబు.

రాజా: (ఏదో ఆలోచించుకుంటు, నవ్వుతూ ఒవల్టిన్ త్రాగబోతాడు.

(ఇంతలో నారాయణరావుగారు ప్రవేశము. సుబ్బన్న నిష్క్రమించును.)

రాజా: నమస్కారమండి నారాయణరావుగారు (అని లేవబోతాడు.)

నారా: (ఇంతలోపడన్‌గా) నమస్తే కూరోచ్చండి. ఎంతసేపైందండి వచ్చి ?

రాజా. ఇప్పుడే వచ్చాను.

నారా: ఏమిటి విశేషాలు వ్యాపారం బాగుందా ?

రాజా: పరవాలేదు. ఈ మధ్యన ఒక బిల్డింగ్ శంకుస్థాపన చేయించాను. 80 వేలు అయింది. మాఘమాసానికి ఆ మూడుముళ్ళు పడితే నా బాధ తీరుతుంది.

నారా: అబ్బాయి చదువులు పూర్తిఅయిపోయినవి. పరీక్షలు కూడా అయిపోవచ్చినవి.

రాజా: అన్నట్లు అబ్బాయి కనిపించడే ?

నారా: లోపల చదువుకుంటున్నాడు. (సంతోషముతో) వాడికి చదువంటె మహాయిష్టము. వాడికి ఎప్పుడూఫస్టో, సెకండో క్లాస్ రావల్సిందే. ఇదిగో సుబ్బన్నా, సుబ్బన్నా......అబ్బాయిని పిలువు ?

సుబ్బ: (సుబ్బన్న ప్రవేశము.) చినబాబుగోర్ని ఎవరో స్నేహితులుగోరు తీసి కెళ్ళేరని శెప్పమన్నారుండీ.

నారా: అబ్బాయి స్నేహితుడు ఎవరో వచ్చి తీసికెళ్ళేరటండి, పోని కూర్చోండి వస్తాడు

రాజా: అబ్బాయిని చూసేదేముంది లెండి. మీరు అన్ని మాట్లాడుకొని 10 రోజులలో ఉత్తరము వ్రాయండి. ఇక నేను వస్తాను.

నారా: సరే అలాగే.

రాజా: నమస్తే వస్తాను. (అని వెళ్ళిపోతాడు.)

నారా: సుబ్బన్నా ? అబ్బాయి ఎప్పుడొస్తానన్నాడు ? వీడిదుంప తెగ, వీడున్నట్లైతే ఎంతబాగుండేది. అన్ని ఇప్పుడే మాట్లాడుకునే పని. (కొంచము సంతోషముతో) అబ్బాయి అదృష్టము సుబ్బన్నా, లక్షలాస్తి, భగవంతుడేమిచేసాడో ఏమో ?

సుబ్బ : కరకట్ టుండె, అంతా భగవంతునిదయ చినబాబుగోరు అదృష్టవంతు లైండి (అని) అరుగో చినబాబుగోరు.

(భాస్కర్ నాన్న ఏంమంటాడో అని భయపడుతూ వస్తాడు. సుబ్బన్న వెడతాడు.)

నారా: ఎక్కడకు వెళ్ళేవురా ?

భాస్క: ఈవేళ బాంబెనుంచి నాస్నేహితు డొకాయనవస్తే అక్కడకు వెళ్ళాను నాన్నా (అని లోపలకు పోబోతాడు.)

నారా, ఇదిగోరా మాట. రాజారావుగారు మళ్ళీవచ్చి వెళ్ళారు. మరి పదిరోజులలో ఏ సంగతి చెప్పమన్నారు. అమ్మాయికి ఆస్తి, చదువు ఉందట మన అదృష్టంకొద్ది వచ్చిందిరా ఈ సంబంధము.

భాస్క: ఇప్పుడు నా పెళ్ళికి తొందరేముంది నాన్నా ?

నారా: తొందరేమిట్రా అపతల ఆస్తిపోతుంటే.

భాస్క: ఆస్తియేనా నాన్న మీకు ముఖ్యము ?

నారా; ఆ అమ్మాయికి ఏమితక్కువరా ? ఏదో అదృష్టముకొద్ది వచ్చిందికాని మనకురావల్సిందటరా ఈ సంబంధము. ఈ ఆస్తికి పెద్ద కలక్టర్ వస్తాడురా కలక్టర్.

భాస్క; అయితే ఆ కలెక్టర్కే యిచ్చి పెళ్ళిచేయమను నాన్నా ?

నారా: (ఎగతాళిగా) ఆ కలక్టర్కి యిచ్చేలెక్కలో అయితే నీవెందుకోయ్ మధ్యన ?

భాస్క: (నవ్వుతూ) అవునునాన్నా నేను అనేది అదే

నారా: ఇదిగో ఇలాంటి పిచ్చివేషాలు వేయక ఆలోచించుకో. వచ్చే అదృష్టాన్ని కాళ్ళతన్నకుండ చూడు. నేను త్వరగా కంపెనీకి

వెళ్ళాలి. (అని లోపలికి వెళ్ళి కాఫీత్రాగి బయటకు వెళ్ళి పోతాడు.)

భాస్క: (నారాయణరావు వెళ్ళిన తరువాత) ఏది ఏమైనాసరే నా సరోజకిచ్చినమాట తప్పను. (అని కుర్చీలోకూర్చుని చదువు కుంటాడు)

(ఇంతలో సన్నగా, ఎర్రగా, కోలమొఖము, రెండు జడలు, కాలేజీ గరల్‌లాగ ఉంటుంది. చేతిలోబుక్ ఉంటుంది.)

సరోజ: (కొంచమునవ్వుతూ) హలో గుడ్‌మోర్నింగ్ భాస్కర్?

భాస్క: ఓ...గుడ్ మోర్నింగ్. రా సరోజ కూర్చో. నాన్నలేర్లే భయపడుతున్నావు. ఏమిటి ఇలావచ్చావు? మీ అన్నయ్య ఏమంటున్నాడు?

సరో: మా అన్నయ్య నా మాట కాదనడుగా (తన్మయత్వం) నేనంటే మా అన్నయ్యకు పంచప్రాణాలు. ఆఁ... ఇదిగో భాస్కర్ సాయంత్రం మీరు, డాక్టర్ రఘుగారు యిదివర కుండిన రూం చూపించానే అక్కడకురావాలి. వారు మా అన్నయ్య ప్రాణస్నేహితులు. మా ఫ్యామలి డాక్టర్‌కూడ చాలా మంచివారు. అక్కడ ఉంటాను. అన్ని అక్కడ మాట్లాడు కుందాము.

భాస్క: మరి సినిమా

సరో: సాయంత్రం వెళదాము నేను, ఆయన (అని భాస్కర్‌ఫొటో అరిచేతిలో పెట్టుకుంటుంది.)

భాస్క: ఆఁ! ఆయనెవరు?

సరో: (వ్రేలితో నొక్కిఫొటోను చూపిస్తూ) అంటే ఈయన.

భాస్క: అమ్మ దొంగ (అని జెడపుచ్చు కుంటాడు.)

సరో: అబ్బా......ఊరుకోండి......ఎవరన్నా వస్తారు.

భాస్క: ఏం వస్తే. కాబోయే భార్యాభర్తలనుకుంటారు.

సరో: (చిలిపిగా) ఊఁ ఆశ అప్పుడే. ఇంకా మీ నాన్నగారితో చెప్పాలేదు, ఆయన ఒప్పుకోలేదు.

భాస్క: సరూ! నీవు తప్పక నా భార్యవవుతావు. మా అమ్మ కలలో వచ్చి చెప్పిందిగా.

సరో: ఏమని?

భాస్క: (రెండు భుజములు పట్టుకొని) ఈ చిలిపిసరోజ నా భార్య అవుతుందని.

సరో: (సిగ్గుతో, ఆనందముతో) ఉఁ...అలాగా

భాస్క: (సరోజ కళ్ళవంక చూస్తూ) ఊఁ...మా అమ్మకలలోవచ్చి చెప్పిందంటే అది తప్పక జరుగుతుంది.

(ఇంతలో నారాయణరావుగారొచ్చి తలుపుకొడతాడు)

నారా: అరేయ్ భాస్కర్

భాస్క: (భయముతో) ఆఁ నాన్న, నాన్న వచ్చాడు.

సరో: (భయముతో) అయితే యిప్పుడెలాగండి.

భాస్క: సరూ......ఆఁ సరూ......అ ఇట్రా ఇదిగో ఈ స్టూల్ చాటునకూర్చో! (అని చిన్నస్టూల్ చూపిస్తాడు.)

సరో: (కోపంతో) ఆఁ ఏమిటండీ?

భాస్క: (కంగారుతో) ఆఁ సారీ ఈ సోఫాచాటున కూర్చో

నారా: అరేయ్ భాస్కర్

భాస్క: ఆఁ వస్తున్నా నాన్నా

సరో : అఁ ఏమోనండి నాకు భయంగాఉంది.

భాస్క: ప్లీజ్ నీకేమీ భయంలేదు. నేనున్నాగా.

(సరోజ కుర్చీచాటున కూర్చుంటుంది. టేబిల్ మీద పుస్తకము పెట్టి పెన్నుక్యాప్‌తీసి, భాస్కర్ వెళ్ళి తలుపు తీస్తాడ.)

నారా: ఏమిట్రా ఏమిచేస్తున్నావ్ యింతసేపు.

భాస్క: (కంగారుతో) ఆఁ ఏమిలేదునాన్నా, వ్రాసుకుంటున్నా.

నారా: (వచ్చి సరోజ దాక్కున్న సోఫామీద కూర్చుంటాడు.)

భాస్క: (తంగారుతో) రామారావుగారు రెండుసార్లు వచ్చివెళ్ళారు. మిమ్మల్ని అర్జంటుగా రమ్మన్నారు నాన్నా!

నారా: నేనిప్పుడు ఆయన్ని కలుసుకొని వస్తున్నాను.

భాస్క: (కంగారుతో) ఈఁ (సరోజసైగ చేయును.)

నారా: ఏరా నే చెప్పిన విషయం ఆలోచించావురా?

భాస్క: ఆలోచిస్తున్నానునాన్నా (సరోజవంకచూస్తూ)

నారా: (లేచి లోపలకు వెళ్ళబోతూ) త్వరగాఆలోచించు (అని వెళ్ళి పోవును.)

సరో : (కుర్చీ వెనుకనుంచి వచ్చి రొప్పుతూ) అమ్మయ్య

భాస్క: సరూ ఇక నీవెళ్ళు సాయంత్రం మాట్లాడుకుందాం.

సరో : భాస్కర్ సినిమా సంగతి మర్చిపోవద్దు (అని వెళ్ళబోవు చుండగా)

(ఇంతలో సుబ్బన్న ప్రవేశము)

భాస్క : అలాగే (అటువైపే చూస్తాడు)
సుబ్బ : ఎవరు చినబాబు ఆ బుల్లెమ్మగోరు ?
భాస్క : ఏది, ఎవరున్నారు ?
సుబ్బ : నన్నే మాయబుచ్చుతున్నావ్ చినబాబు. రెండుజడల బుల్లెమ్మను సూశాను గే బాబు.
భాస్క : ఆ!... ఆ అమ్మాయి నా క్లాస్.మేట్ సుబ్బన్నా.
సుబ్బ : కాసుమెట్టా ! కాసుమెట్టంటే ఏటి సినబాబు ?
భాస్క : క్లాసు మేటంటే నా స్నేహితురాలులే?
సుబ్బ : స్నేహితురాలైతే కూసోని మాటాడక అట్టాపోతుందేమిటి ?
భాస్క : అబ్బ! ఏమిలేదులే నన్ను విసిగించకు.
సుబ్బ : నే కనిపెట్టేనులే చినబాబు. నాతో శెప్పుబాబు, నేను పెద బాబుగారికి సెప్పను.
భాస్క : సుబ్బన్నా !
సుబ్బ : శెప్పుబాబు నేను సిన్నప్పుటాల్నించి ఈ సేతులతో మోశాను. తమరు సుఖమే నాకుకావాలి బాబు.
భాస్క : ఏమిలేదు సుబ్బన్నా. కాలేజీలో నేను ఆ అమ్మాయి కలిసి చదువుకున్నాం. చాలామంచిది. పేరు సరోజ. ఆ అమ్మాయికి పేదలంటే మహా ఇష్టము సుబ్బన్నా.
సుబ్బ : (సంతోషముగా) అయితే ఇలాంటి బుల్లెమ్మగోరే కావాలి చినబాబు.
భాస్క : సుబ్బన్నా ! ఈ అమ్మాయిది అవనిగడ్డ అనే ఒకపల్లెటూరు. సరోజ వట్టి అమాయకురాలు, నన్నే నమ్ముకున్నది. కాని నాన్న ఒప్పుకోడు, ఈ అమ్మాయిని పెండ్లాడటం. నాన్నకు నాకు ఈ విషయములో తగాదా రావచ్చు.

సుబ్బ : నాకు అదే భయంగా ఉందిబాబు.

నారా: (ఇంతలో నారాయణరావు ప్రవేశము.) అరేయ్ భాస్కర్ నేను ఏలూరు వెళుతున్నాను, రాత్రికి వస్తాను. ఇంటిదగ్గర జాగ్రత్త సుబ్బన్న (అని వెళ్ళిపోవును.)

భాస్క: (సంతోషముతో) ఆఁ నాన్న ఊరెళుతున్నారా ! సుబ్బన్నా సాయంత్రం సినిమాకు వెడుతున్నాను. నాన్న ఎప్పుడొచ్చినా సరే, ఇప్పుడే వెళ్ళేడనిచెప్పు. రా సుబ్బన్నా నీళ్ళుతోడుదువు గాని. (అనియిద్దరు లోపలికి వెళ్ళెదరు. తిరిగివెంటనేభాస్కర్ బయటుకుపోవును. ఇంతలో పరమానందం బయటునుండి వస్తాడు.)

పర : (వచ్చి) ఇదిగో భాస్కర్‌బాబు నాన్నగారున్నారా ? ఎవరు లేరనుకుంటా (అనిపేపరుచూస్తాడు.)

రాజా: (ఇంతలో రాజారావు ప్రవేశము) నారాయణరావుగా రున్నారండీ!

పర : (మాట్లాడడు.)

రాజా: ఏమండోయ్ మిమ్మల్నే, నారాయణరావుగారున్నారా ?

పర : ఆఁ... ... లేరనుకుంటానండి. బయటుకు వెళ్ళి ఉంటారు.

రాజా: అరె లేరన్నమాట.

పర : దేనికండి ? చెప్పండి వారిమేనేజర్నే, అదిగాక పరసనల్ అసిస్టెంట్‌ని. ఏమన్నా ఇనుస్టుమెంట్సుకు ఆర్డర్‌యిస్తారా ?

రాజా: ఆఁ... ఏమీలేదు మా అమ్మాయి సంబంధంగురించివచ్చాను.

పర : సంబంధమా, మా భాస్కర్ బాబుకే!

రాజా: ఏం అలా అంటున్నారూ !

పర : ఆహా ఏమిలేదు. మా భాస్కర్‌కు రెండుసంబంధములు వచ్చిన వట. ఒకరేమోరావుబహుదూర్‌గారట. రెండవది రాజారావు గారట. మొన్ననాతో చెప్పారు. అయితే మీరు మూడవ అమ్మాయి అన్నమాట.

రాజా: ఆఁ? (కోపంతో)

పర: (పడన్‌గా) అదే మీ అమ్మాయిగారు.

రాజా: ఆ రెండు సంబంధాలగురించి ఏం చెప్పేరు?

పర: ఈ రెండు సంబంధాలలో ఏ అమ్మాయిని చేసికోమంటారు మేనేజరుగారూ? ఇద్దరు సమాన ధనవంతులు, మరి మీ సలహా అని అడిగారు.

రాజా: మరి నీవు ఏం చెప్పావు?

పర: ఆలోచించి చెపుతాను అన్నాను. కాని యిప్పుడు మూడోది మీది. మరి ఏది అవుతుందో! అబ్బాయి ఉన్నాడు చూశారు నా మాటంటే తప్పక యింటాడు.

రాజా: ఇదిగో మేనేజరుగారు నాకొక చిన్నసహాయం చేయాలి. అబ్బాయిని మన సంబంధానికి ఒప్పించాలి. రాజారావంటే ఎవరో కాదు, నేనే. రాజారావుగారి సంబంధం మంచిదని, ఆస్తి అంతా మీకే దక్కుతుందని చెప్పాలి. ఇదిగో కావాలంటే ఈ వందవాడుకో (అని 100రూ ఇవ్వబోతాడు.)

పర: ఎందుకులెండి డబ్బు. వందరూపాయలు వచ్చి ఉద్ధరిస్తాయా?

రాజా: సరే (అని 100రూ॥ లోపలపెట్టుకొని) ఎలాగో సహాయం చేయి.

పర: (ఈ గొణుగుతూ) ఆఁ ఏమీ లేదు. మా ఆరవఅమ్మాయికి పెండ్లి కాయమైంది. కాని 5, 6 వందలు నాదగ్గర వున్నవి. ఇంకా 4 వందలు చూసి ముడి పెట్టేద్దామని చూస్తున్నా.

రాజా: అయితే ఈ 4 వందలుంచుకోవయ్యా (అని 400రూ॥ యిస్తూ) జాగ్రత్త అబ్బాయిని మన సంబంధాన్కే ఒప్పించాలి సుమా!

పర: (డబ్బుతీసుకొని కోటుజేబులో పెట్టుకుంటూ) మాట ఉండాలి కాని వెనవ డబ్బు దేముందండి. ఈ వేళ వస్తుంది రేపు పోతుంది. తప్పక భాస్కర్‌తో ఈ రోజే చెపుతాను.

రాజా: మరి నే ఎల్లుండి వస్తాను.

పర: మరి మీరు వెళ్ళిరండి (రాజారావు వెళ్ళిపోవును. ఇంతలో సుబ్బన్న ప్రవేశము.)

సుబ్బ: ఎంతసేపైయింది వచ్చి మేనేజరుగారు? ప్రొద్దుగూకి వచ్చారే!

పర: ఆ, ఇప్పుడే వచ్చాను. నారాయణరావుగారున్నారేమోనని వచ్చాను.

సుబ్బ: మధ్యాన్నము ఊరెళ్ళేరు వచ్చే టైమయిందిబాబు.

పర: సరె రేపొస్తాను. (అని వెళ్ళిపోబోతాడు.)

సుబ్బ: తమ ఆరవ అమ్మాయిగోరి పెళ్ళి కుదిరిందటగా. పొప్పన్నం ఎప్పుడుబాబు.

పర: త్వరలోనే పెడదాంకాని, ఇదిగో ఈ రూపాయి దేనికన్నా వాడుకో (రూపాయి ఇచ్చును.)

సుబ్బ: (రూపాయి తీసుకొని) తమసేత్తో ఆరేళ్ళనుంచి నయాపైస కూడ ఇవ్వలేదు. అదికాక తమరు ఒకఅణా నుట్ట పుగాకడిగితేనే ఇవ్వరు. ఈ వేళేంటి బాబుయిది రూపాయిత్తున్నారు.

పర: ఏదో ఈ వేళ సంతోషంగా ఉంది. మరినేవస్తాను. (అని వెళ్ళిపోవును.)

సుబ్బ: నమస్కారంబాబు (అని లోపలికి వెళ్ళిపోవును. లైట్లు ఆర్పేయాలి. ఇంతలో నారాయణరావుగారు ఉదయము వచ్చును.)

నారా: సుబ్బన్నా?

సుబ్బ: వత్తున్నానుబాబు (అనివచ్చి) ఏంటిబాబు?

నారా: భాస్కర్ ఎక్కడికెళ్ళాడు?

సుబ్బ: ఇప్పుడే కాఫీతాగి వెళ్ళేరుబాబు? మీకు కాఫీ తెమ్మంటారా బాబు.

నారా: వద్దు నేను తీసుకునే వచ్చాను. (ఇంతలో భాస్కర్ భయపడుతూ వస్తాడు.)

భాస్క: నాన్నా రాత్రెన్నింటికి వచ్చారు?

సుబ్బ: (భయంతో ఉండాలి.)

నారా: రాత్రేమిట్రా ఇప్పుడొస్తే?

భాస్క: (సర్దుకొని) ఆఁ అదే యిప్పుడే, ఎంతసేపైయింది నాన్న వచ్చి.

సుబ్బ: (గొంతు సవరించుకొంటు లోపలికి వెళ్ళిపోవును.)

నారా: ఇప్పుడే నీవు కాఫీ త్రాగి వెళ్లేవట, నీ వెళ్ళంగానే వచ్చాను గాని, ఏమిట్రా, రాజారావుగారి సంగతేమిటి ? ఉత్తరం వ్రాసేస్తున్నాను ఈవేళ.

భాస్క: ఈ పెళ్ళివద్దునాన్నా

నారా: మరి రావుబహుదూర్‌గారి అమ్మాయిని పెళ్ళిచేసుకుంటావా?

భాస్క: అసల్నాకు ఈ పెళ్ళిళ్ళేవద్దు నాన్నా

నారా: మరి ఏపెళ్ళి కావాలి ?

భాస్క: ఇచ్చిన మాట తప్పలేను నాన్నా

నారా: ఎవరికిచ్చావురా మాట.

భాస్క: నా సరోజకు

నారా: (ఎగతాళిగా) ఎవర్రా ఆరోజా ?

భాస్క: నాన్నా! పొరపాటున మీరు ఉత్తరం వ్రాస్తారేమో. మీ మాటకూడ పోతుంది. (నెమ్మదిగా) నేను ఇక ఏదీ దాయ లేను నాన్నా. నా సెకండ్ బి.ఏ. లో ఒక అమ్మాయిని ప్రేమించాను. ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుంటానని మాట యిచ్చాను. (బాధతో) పాపం ఆ అమ్మాయిని మోసంచేయ లేను నాన్నా.

నారా: (ఎగతాళిగా) కన్నతండ్రిని మోసం చేయరానాన్నా; పిడి శావుగాని ఆ ప్రయత్నం మానుకో.

భాస్క: వీల్లేదు నాన్నా

నారా: ఏమిట్రా నీ వనేది ? లక్షాధికారి బిడ్డరా, నే చెప్పినపెళ్ళి చేసుకోరా. సరోజా, సరోజా, అంటావేమిట్రా ? ఆస్తిలేదు పాస్తిలేదు.

భాస్క: ఆస్థికాదునాన్నా ముఖ్యం, మనకు లేదా ఆస్తి? సరోజ గుణవంతురాలు, నాతోపాటు చదువుకుంది. పైగా ఫస్టు క్లాసులో పాసైయింది.

నారా: (బ్రతిమలాడుతూ) నామాట వినరా, ఆస్థివస్తుంది. పరువు నిలుస్తుంది. పేదింటమ్మాయిని పెళ్ళిచేసుకొంటే ఏమొస్తుందిరా.

భాస్క: నాన్నా! పేదింటమ్మాయిని పెళ్ళిచేసుకుంటేనే పరువు గౌరవం లభిస్తాయి నాన్నా. పేదింటమ్మాయిని పెళ్ళిచేసుకొని పైకి తీసుకొచ్చినవాళ్ళ మౌతాం.

నారా: అయితే నామాట వినవన్నమాట, ఆ రాజారావుగారు మన మీడే ఆశపెట్టుకున్నాడు పాపం.

భాస్క: వారి అమ్మాయికూడ ఒకపేద విద్యావంతుడ్ని చేసికుంటే ఎంత బాగుంటుందినాన్నా

నారా: అరేయ్, ఆ అమ్మాయికి కూడ వెళ్ళి చెప్పిరారా. తా చెడ్డ కోతి వనమంతా చెరిచిందట. అట్లాగే నీవుచెడింది కాకుండ ఆ అమ్మాయిని కూడా చెడగొట్టు

భాస్క: ఏమోనాన్నా! నా హృదయములో నా సరోజకు తప్ప మరిఎవ్వరికి స్థానంలేదు.

నారా: వీల్లేదు రాధనే చేసుకోవాలి. సరోజను చేసుకుంటానికి వీల్లేదు. నా కంఠములో ప్రాణముండగా నే ఒప్పుకోను.

భాస్క: నాన్నా నాకే ఒకచెల్లి ఉంటే ఆ చెల్లి మనకంటే ధనవంతుణ్ణి ప్రేమిస్తె మీలాగే వారు మన అంతస్తు చాలదని చెల్లి మాట నిరాకరిస్తే మీరు ఏంచేస్తారునాన్నా?

నారా: అలా ప్రేమించకుండగానే చూస్తాను.

బాస్క: ఒకవేళ ప్రేమించి ఉంటే?

నారా: మన దురదృష్టమని ఊరుకోవాలి, మనకు తగిన బంధాన్నే చూసుకోనాలి.

భాస్క: బంధాల్ని విడదీసినంత మాత్రాన మనసులను విడదీయ గలరా. యిదంతాఎందుకు? నేను ప్రేమించకుండగా చూడగలి

గారా నాన్నా. ప్రేమించేది తల్లిదండ్రులకుచెప్పి ప్రేమిస్తారా నాన్నా.

నారా: ఆరేయ్ నీకు కాలేజిలో యివే చెపుతున్నారా ?

భాస్క: అవును నాన్నా. న్యాయాన్ని కాపాడమని ప్రతికాలేజిలో చెవుతారు.

నారా: ఈ వాదనతో నాకనవపరం. నే చెప్పిన అమ్మాయిని చేసు కుంటావా లేదా ?

భాస్క: (బాధతో)నాన్నా ప్రేమించినమ్మాయిని పెళ్ళిచేసుకోక ఆమె జీవితాన్ని నాశనంచేసి, పెళ్ళి చేసుకున్న అమ్మాయికి మన సివ్వక ఆమె జీవితాన్ని నాశనం చేసి, రెండుజీవితాల్ని నాశనం చేయలేను నాన్నా, నాశనం చేయలేను.

నారా: (కోపంతో) అయితే విను.

భాస్క (బాధతో) తెలుసు నాన్నా

నారా: (కోపంగా) ఏమిటి ?

భాస్క: ఈ రోజుల్లో తండ్రుల యిష్ట ప్రకారం పెళ్ళిచేసికోపోతె ఆస్థి దక్కదు. అంతేగానాన్నా.

నారా: (ఉద్రేకముతో) అంతేకాదు. ఈ యింటిలోకూడ ఉండ కూడదు. నీకు నాకు సంబంధంలేదు. పో వెళ్ళు (అనిభాస్కర్ వంక చూస్తాడు.)

భాస్క: నాన్నా! వెడతానాన్నా, నే వెళ్ళినతరువాత ఈ ఆస్థితో మీరే సుఖించండి. (అనిభాస్కర్ఏడుస్తూబాధతో తల్లిఫోటో దగ్గరకు వెళ్ళి) (సుబ్బన్నవస్తాడు)

భాస్క: (ఏడుస్తూ) అమ్మా ఏమిటమ్మాయిది. సరోజను పెళ్ళిచేసుకో మన్నావ్. నాన్న వద్దంటున్నారు. నీవు కలలో చెప్పిన తరు వాత నా హృదయాన్ని సరోజ కర్పించాను, ఈ విషయంలో నాన్న మాట వినలేకపోతున్నానమ్మా (నమస్కరిస్తూ) నన్ను క్షమించమ్మ (అని తండ్రిదగ్గరకొచ్చి) నాన్ననమస్కారం... వస్తాను.

సుబ్బ: (బాధతో) చినబాబు

భాస్క: వస్తాను సుబ్బన్నా, నాన్నను జాగ్రత్తగా చూసుకో (అని వెళ్ళిపోవును.)

సుబ్బ: (బాధతో) పెదబాబుగోరు ఏంటండీయిది. చినబాబు లేకుంటే బతగలమా. చినబాబు బాధపడితేనే మీరు మంచం ఎక్కుతారే? యిప్పుడు ఏడుత్తుంటే మీ మనసు కరగటంలేదాబాబు చినబాబును వెళ్ళిపొమ్మంటానికి మీ మనసు ఎలా ఒప్పుకుందిబాబు నాకు కలలోపెద్దమ్మగోరు శెప్పారు. చినబాబును మీ పెద్దయ్యగోరు ఏమి అనకుండగా సూడు సుబ్బన్నా అని శెప్పేరు. యిక్కడబాబు ఏడిస్తే అక్కడ అమ్మగోరిమనసు నొచ్చుకుంటుందిబాబు.

నారా: నామాణిక్యం ఉంటే నాకీ కష్టాలు వచ్చేవికావు (అని ఫొటో దగ్గరకు వెళ్ళి) మాణిక్యం పశువులాగా ప్రవర్తించానా? ఏమిటో మాణిక్యం నేను ఏదో పాపం చేశాను. ఉండమనలేకపోయాను. ఆస్తినిగురించి మనస్సు నిలుపుకో లేకపోయాను. ఏంచేయదలచుకున్నాదో ఏమో మాణిక్యం (అని మనేదతో లోపలికి వెళతాడు. సుబ్బన్నకూడ లోపలికి వెళ్ళును.)

లైట్లు ఒకసారి ఆరి వెలుగుతాయి. నారాయణరావు ప్రవేశము.)

నారా: సుబ్బన్నా !

సుబ్బ: (వచ్చి) అయ్యా ?

నారా: వారంరోజులయింది, అబ్బాయి యింకా రాలేదు.

సుబ్బ: అవునయ్యా, తమకెంత పట్టుదలో అబ్బాయిగోర్కి అంతే పట్టుదల.

నారా: ఇదిగో పూజార్లుగారులేరూ? అదే జ్యోతిష్యుడు ఆయనను ఒక్కసారి రమ్మను.

సుబ్బ: రేపొద్దుట పిలుత్తానయ్యా, రాత్రిపూట ఎందుకు?

నారా: కాదు యిప్పుడే పిలువు.

సుబ్బ: అలాగేబాబు (అని సుబ్బన్న బయటకు వెళ్ళిపోతాడు.)

నారా: కనీసం ఒక్కతిట్టయిన తిట్టేవాడ్నికాదు నేను. ఎంతో గారాబంగా పెంచుకున్నాను. ఇలా చేస్తాడని నేను ఎప్పుడు అనుకోలేదు. (సుబ్బన్న, జ్యోతిష్యుడు వస్తారు.)

జ్యోతి: నమస్కారం మహాప్రభూ

నారా: నమస్తే పంతులుగారు.

జ్యోతి: తమరు పిలిపించింది నాకు అర్థమయిందిలే. మొఖము పరిశీలిస్తేచాలు మనసులో భావాలు, జరగబోయె విషయాలు, జరిగినవికూడా చెప్పివేయటములో అందివేసినచేయి అని తమబోటి ప్రభువులు అంటూ ఉంటారు.

నారా: ఏమిలేదు. సుబ్బన్నా లోపలికి వెళు.

జ్యోతి: (ఆలోచనగా) ఏమిటబ్బా! లోపలికి వెళ్ళమంటున్నాడు. అదిగాక రాత్రిపూట రహస్యంగా పిలిపించారు. పోయిన లఘ్నాలలో ఈయన మళ్ళీ పెళ్ళి చేస్కుంటాన్కి ప్రయత్నించాడన్నారు. బహుశా మళ్ళీ ఆ ప్రయత్నమే ఐ ఉండవచ్చు. (కుర్చీసర్ది సుబ్బన్న లోపలికి వెళ్ళిపోతాడు.)

నారా: ఆఁ ఏమిలేదు, నాకు ఒక ఆలోచన కల్గినది. అది ఏమౌతుందో ఏమో?

జ్యోతి: ఏమి అవుతుందేమిటి! దివ్యంగా జరుగుతుంది. మీ మనస్సులోమాట (పుస్తకములో చూస్తూ) ఇక్కడ వ్రాసేయున్నది.

నారా: ఏమిటో మీమాట కూడ తెలుసుకొని ఆ ప్రకారం చేద్దామని నిర్ణయించుకున్నాను. మీరు జరగబోయే విషయాలు చెబుతారట.

జ్యోతి: హి...హి...హి...ఓ దివ్యంగ చెపుతాను. జరిగినవి జరగబోయేవి ఒకకేమిటి? లక్ష చెపుతాను.

నారా: నాకు ఆస్థి దక్కేటట్టులేదు, అబ్బాయి దక్కేటట్టులేదు ఏమిటో.

జ్యోతి: (ముక్కుపొడుం పీల్చి మెల్లగా) అబ్బాయి అంటాడేమిటి? ఈయన పెళ్ళి చేసుకుంటానికి అబ్బాయి ఒప్పుకోడేమోనని అనుకుంటున్నారు. (బిగ్గరగా) అదృష్టవంతులు తమరు. ఏమి పరవాలేదు. అబ్బాయికూడా ఒప్పుకుంటాడు, పెళ్ళివిషయం ఆలోచిస్తున్నారు.

నారా: (ఉత్సాహంగా) అదేనండి అదేనండి.

జ్యోతి: తప్పక జరుగుతుంది. ముహూర్తాలు కూడా మంచివే వున్నాయ్, ఆషాఢ మాసమైనా పర్వాలేదు. మంచి లఘ్నం ఒకటి ఉన్నది. యికపోతె మీ మనస్సులో అమ్మాయిపేరు చెప్పండి, తారాబలాలు చూస్తాను.

నారా: (కొంచం ఉత్సాహంగా) పేరు రాధ, రాజారావుగారి కుమార్తె, పెద్ద లక్షాధికారి.

జ్యోతి: తమలాంటి వారికి ధనవంతులు రావడం పెద్దగొప్ప ఏమిటుండీ, తప్పకవస్తారు. కోటీశ్వర్లాంటి వారుకూడా వస్తారు. (పుస్తకములో చూస్తూ) ఆగణితంచూస్తాను. (ఏదోలెక్కవేసి) ఆం నారాయణరావుగారు రాధా, రాధా నారాయణరావుగారు ఊం ఆహా పేర్లు బాగాకుదిరినవి. ద్వితీయ వివాహం మొదటి దానికన్నా చాలాబాగుంది.

నారా: (మెల్లగా) వీడు నారాయణరావు అంటాడేమిటి? కొంపతీసి నాకు రెండో పెళ్ళి అనుకోవటంలేదుకదా! (అని బిగ్గరగా) ద్వితీయవివాహం అంటున్నారేమిటి ?

జ్యోతి: అంటే రాధమ్మకు కాదండి, మీకు. మీకు రాధమ్మగార్కి మంచిపేరుబలాలు కుదిరాయి సుమండి !

నారా: (కోపంతో) పంతులూ ఏమిటది ?

జ్యోతి: భవిష్యత్తు చెప్పమని తమరే శెలవిచ్చారు.

నారా: (కోపంగా) భవిష్యత్తా నీ బొందా...

జ్యోతి: తమకు అప్పుడే అంత ఆగ్రహంవస్తే...

నారా: (కోపంగా) ఆగ్రహం ఏమిటయ్యా, కొడుకు పెళ్ళి గురించి జ్యోతిష్యం చెప్పమంటే, నాకు పెళ్ళిచేస్తానంటావ్ ఏమిటయ్యా! యిదేనా భవిష్యత్తు ?

జ్యోతి: (తడబడుతూ) ఆఁ... అది కాదు మీరు ..

నారా: మీరూ లేదు గీరు లేదు వెళ్ళవయ్యా!

జ్యోతి: (వెళుతూ) కథంతా అడ్డం తిరిగిందే (అని వెళ్లిపోవును.)

నారా: ఛీ, అంతా కర్మకొద్దీ దొరుకుతారు. ఏమిటో, ఎలాజరగాలని ఉంటే అలాజరుగుతుంది. అయినా జ్యోతిష్యం ఏమిటి? (అని లోపలకిమాస్తూ) సుబ్బన్నా! (గట్టిగా) సుబ్బన్నా! (సుబ్బన్న వస్తాడు.) కాసిని మంచినీళ్ళుపట్రా.

సుబ్బ: (సుబ్బన్న మంచినీళ్ళు తెచ్చియిస్తూ) బాబు పదిరోజుల్నించి సరిగా భోజనం చేయుటలేదు. భోంచేదురుగాని రండి బాబు.

నారా: (మంచినీళ్ళుత్రాగి) వద్దు సుబ్బన్నా, నీవుభోంచేసి వంటింట్లో లైట్లార్పేసి పడుకో.

సుబ్బ: బాబు తమకి మంచం ఎక్కడెయ్యమన్నారు?

నారా: ఇక్కడకే తీసుకురా (సుబ్బన్న లోపలికి వెళ్ళి మంచం దిండు, దుప్పటి, తెచ్చి పక్కవేసి లోపలికి వెళ్ళిపోతాడు)

నారా: (లైట్లార్పేసి పండుకుంటాడు. నాల్గు, మూడు నిమిషాలు గడిచిన తరువాత తెరవెనుక మాణిక్యం మాటలు వినపడతాయి.)

మాణి: (ఏడుస్తూ) నాబాబును కష్టపెడుతున్నారా. నాబాబును చంపేస్తారా? ఏమండి నాబాబు, సుబ్బన్నా నాబాబు. బాబు నిన్ను చంపేస్తారు (ఏడుస్తూ) ఏమండి నాబాబును యిష్టం వచ్చినట్లుగా చేయనీయండి. ఈ ఒక్క సహాయము చేయండి. వాడు ఎప్పుడు అప్పుచేయడు.

నారా (కలలో) మాణిక్యం (బిగ్గరగా) మాణిక్యం, లేదు......లేదు బాబును పిలిపిస్తాను. మాణిక్యం మనబాబు యిష్టప్రకారం చేస్తాను. ఈరోజే పిలిపిస్తాను.

సుబ్బ: (కంగారుతోవచ్చి) బాబుగోరు పెదబాబుగోరు.

నారా: (నారాయణరావు లేచికూర్చోవాలి.)

సుబ్బ: ఏంటిబాబు అలాకేక వేశారు.

నారా: (మెల్లగా) ఏమిలేదు సుబ్బన్నా! (బాధతో) బాబు ఎక్కడున్నాడో, ఏంచేస్తున్నాడో. సుబ్బన్నా బాబును ఎక్కడున్నా పిలిపించాలి.

సుబ్బ: (సంతోషముతో) అంగాగే బాబు.

నారా: యిదిగో ఇప్పుడే మ్యానేజరు యింటికెళ్ళి అబ్బాయిని ఎక్కడున్నా రమ్మనమని పేపర్లో వేయించమను. సరోజను కూడా తీసుకురమ్మను. త్వరగా రావాలి. మీ నాన్నగారు జబ్బుగా ఉన్నారని వేయించమను.

సుబ్బ: అలాగే బాబు.

నారా: ఇదిగో చూడు ఆ అమ్మాయి అడ్రసు నీకుతెలుసుగా! తెల్లవారు జామున నీవుకూడ వెళ్ళి ఎక్కడున్నా సరే వెంటబెట్టుకొని తీసుకొద్దువుగాని.

సుబ్బ: అలాగే బాబు,

నారా: మ్యానేజరింటికెళ్ళి ఇప్పుడే చెప్పిరా (సుబ్బన్న బయటకు వెళతాడు. నారాయణరావుగారు పండుకుంటాడు.)

[తెరపడును]

## 2

(తెరలేచేసరికి రెండు కుర్చీలు, ఒక చిన్నడ్రాయరు, దేశనాయకుల ఫొటోలుంటవి. భాస్కర్ కుర్చీలో కూర్చొని పెన్సిల్‌తో కాగితముమీద బొమ్మగీస్తుంటాడు. యింతలో పైజమా, లాల్చీ వేసుకొని బయటనుంచి ప్రసాదు సంతోష ముతో ఆదుర్దాగా పేపరుచేతిలో పట్టుకొని వస్తాడు.)

ప్రసా: (వస్తూనే) ఇదిగో భాస్కర్! సరోజ! సరోజ!

భాస్క: (పేపరుమీద గీస్తూనే) ఏమిటిబావా హడావుడి?

ప్రసా: నీకొక శుభవార్త చెప్పనా!

భాస్క: (పేపరు, పెన్సిల్ చేత్తోవుంచి) ఎప్పుడూ అశుభవార్తలు చెబుతావ్. ఈవేళ శుభవార్త ఏమిటిబావా!

ప్రసా: (పేపరు వెనక్కు పెట్టుకొని) ఏమిటో కనుక్కో చూద్దాం?

భాస్క: (పేపరు తీసుకొని) ఏముంది దీన్లో ఏదన్నా ఉద్యోగానికి దరఖాస్తు కావాలటా!

ప్రసా: ఉద్యోగం ఏంటి (వేలుపెట్టి పేపరులో చూపిస్తూ) యిదిగో భాస్కర్, మీ నాన్నగారు నిన్ను మా సరోజను వెంటనే యింటికి రమ్మన్నారు. మా సరోజ చాలా అదృష్టవంతురాలు.

భాస్క: (చదివి సంతోషముతో) సరోజా! సరోజా!

సరో: (ప్రసాదంతోవచ్చి) ఏమిటండీ ఆ అదుర్దా? (అని యిద్దరికి ప్రసాదం పెడుతుంది.)

భాస్క: (ప్రసాదం తీసుకొని) మనం అదృష్టవంతులం సరోజ. నాన్న మన యిద్దర్ని రమ్మన్నారు. మనపెళ్ళి నాన్న కిష్టమేనట. నాన్న మనేదతో మంచమెక్కేరట.

సరో: మావయ్య ఉద్రేకంలో అలా అన్నారుకాని చాలా మంచి వారండి. నేను ఎంత అదృష్టవంతురాల్నో (తన్మయత్వం)

ప్రసా: ఈ రోజుకి నీ పూజ ఫలించిందమ్మా. యిక నీకేలోటులేదు. ఈ సంతోషములో ఈవేళ ట్యూషన్ మానుకుంటానమ్మా.

భాస్క: గుళ్లో పెళ్ళైనసంగతి నాన్నకు తెలియదు.

ప్రసా: (జాలిగా) భాస్కర్ మీనాన్నగారు నీ పెళ్ళి ఎంతో వైభవంగా చేసేవారు. కాని మా చెల్లిగురించి గుళ్లోపెళ్ళి చేసుకోవలసి వచ్చింది.

భాస్క: అసలు నా దృష్టిలో అదే పవిత్రమైనది! నాన్నగారితో ఇదే చెపుతాను. బావా ఈవేళే ప్రయాణ మౌతాం.

ప్రసా: రేపెళ్లొచ్చుగా భాస్కర్ తొందరేముంది?

భాస్క: నాన్నగారు ఎలాఉన్నారో? పేపర్లో లేవడంలేదని వ్రాశారు.

ప్రసా: అయితే నేను కొంచం బజారు కెళ్ళొస్తాను. వచ్చిన తరువాత మాట్లాడదాం! (అని లోపలికి వెళతాడు. సరోజ లోనికి వెళ్ళి వస్తుంది.)

భాస్క: సరోజా మీ అన్నయ్య బహుశ ప్రయాణానికి ఏమన్నా తతంగం చేస్తున్నాడేమో? ఏమీ వద్దను.

సరో: (బాధతో) పేదవాళ్ళం ఏంచేస్తాం. అదే షావుకార్లు అయితె నగలతో, నాణ్యాలతో పంపిస్తారు. కనీసం ఒక జతబట్టలైన పెట్టకపోతె నేను బాధపడతానని అన్నయ్య ఉద్దేశ్యం. అన్నయ్య డబ్బుఅంతా నా చదువులకే ఖర్చుచేశాడు. యిప్పుడు మిగిలిందల్లా ఈ యిల్లే.

ప్రసా: (లోపలనుంచి బయటకు వెడుతూ) సరోజా నేవస్తాను. నేను రావటం ఆలస్యమైతే మీరు భోజనాలు కానీండి.

సరో: త్వరగా రా అన్నయ్య! (అలాగే అని వెడతాడు)

భాస్క: సరోజ యింతలో బట్టలవి సర్దుదువుగాని రా (అని ఇద్దరులోనికి వెడతారు.)

(యింతలో సుబ్బన్న ప్రవేశం)

సుబ్బ: బాబుగోరు! ఎవరు బాబుగోరాయింటో! పెసాద్‌గోరి యిల్లిదే నండి! ఏమండోయ్ (సరోజ వస్తుంది.)

సరో: ఆఁ ఎవరు కావాలి?

సుబ్బ: ప్రసాద్‌గోరి యిల్లిదేనండి?

సరో: అవును యిదే ఏం?

సుబ్బ: మాది బెజవాడ. భాస్కర్‌బాబు ఉన్నారా అమ్మా?

సరో: ఆఁ ఉన్నారు. పిలుస్తాను, కూర్చోండి.

సుబ్బ: నేను భాస్కర్ బాబుగోరి నౌకర్ని అమ్మగోరు.

సరో: (సంతోషముతో) అఁ నీపేరు సుబ్బన్నేగా

సుబ్బ: అవును బుల్లెమ్మగోరు.

సరో: (ఉత్సాహముతో లోపలికి వెళ్తూ) ఏఁ పండోయ్! మిమ్మల్నే మన సుబ్బన్న వచ్చాడండి, (యిటుతిరిగి) సుబ్బన్న మంచినీళ్లు త్రాగుతావా? *

సుబ్బ: కొంచం యివ్వండమ్మగోరు. (సరోజ లోపలికి వెళ్ళి తెచ్చి యిచ్చును.)

భాస్క: (ప్రవేశం. కొంచం బాధతో) సుబ్బన్నా నాన్న కులాసాగా ఉన్నారా?

సుబ్బ: (బాధతో) కులాసా! పెదబాబుగోర్కి మీరు దగ్గర లేకుంటే కులాసా ఎక్కడనుంచి వస్తుందిబాబు? మీరు వెళ్ళినదగ్గర నుంచి మనేదతో మంచమెక్కేరు. మొదట్లో అలా అన్నారు. మిమ్మల్ని సూడందే ఒక్కక్షనం ఉండలేరుబాబు. (సంతోషముతో) బుల్లెమ్మగోర్ని కూడ వెంటనే తీసుకురమ్మన్నారు బాబు.

సరో: (బాధతో) మావయ్య మరి మొందన్నా తీసుకుంటున్నారా సుబ్బన్నా?

సుబ్బ: మనో వ్యాధికి డాకటేరుగోరు ఏమందిత్తారు బుల్లెమ్మగోరు. యిత్తన్నారనుకోండి, ఏదో ఎర్రనీళ్ళు. మీరువత్తే వారికి ఏ జబ్బు ఉండదు.

భాస్క: ఉదయం పేపర్లో చూశాం. నాన్నగారు ఎలాఉన్నారో అని అదుర్దాతో యిప్పుడే బయల్దేర్దామను కుంటున్నాను (సరోజ లోపలికెళ్ళును.)

సుబ్బ: సరేబాబు! బుల్లెమ్మగోరి అన్నగోరేరి బాబు?

భాస్క: ఆయన బజారుకెళ్ళారు, యిప్పుడేవస్తారు.

సరో: (వచ్చి)తర్వాత మాట్లాడొచ్చులెండి. భోంచేయనీండిముందు. పాపం చాలా ఎండెక్కింది. సుబ్బన్నా స్నానం చేస్తావా?

సుబ్బ: వద్దులెండి అమ్మగోరు.

సరో: అయితె భోంచేద్దువుగాని రా?

సుబ్బ: మా బాబుగోరు భోంచేశారా అమ్మగోరు?

భాస్క: ఈవేళ నాకు ఆకలిలేదు. వాళ్ళన్నయ్య వచ్చిన తర్వాత భోంచేస్తాను. నీ వెళ్ళి భోంచెయ్యి.

సరో: రా సుబ్బన్నా (అని సరోజ వెళ్ళును, సుబ్బన్నకూడా వెనుకనే వెళ్ళును.)

భాస్క: (ఆ పేపరంతే చూస్తూ కొంచం దిగులుగా ఆలోచిస్తూ కూర్చుంటాడు. కొంచంసేపటికి ప్రసాద్ 2 ప్యాకెట్స్‌తో వచ్చును.

ప్రసా: ఏమిటి భాస్కర్ అలాదిగులుగా కూర్చున్నావ్?

భాస్క: ఏమిలేదు. మా యింటి దగ్గరనుంచి సుబ్బన్న వచ్చాడు. వెంటనే నాన్నగారు బయలుదేరి రమ్మన్నారట. మా నాన్న గారు మరీ లేవటంలేదట. (సరోజ ప్రవేశము)

సరో: (వచ్చి) భోజనానికి రండన్నయ్యా! వారింకా భోంచెయ్య లేదు. నీవు వచ్చినతరువాత భోంచేస్తానన్నారు. చాలా ఆలస్య మైంది.

ప్రసా: ఏం భాస్కర్ గలేవాడిని పద భోంచేద్దాం. (అందరులోపలికి వెళతారు.) (సుబ్బన్న ప్రవేశం)

సుబ్బ: (ఒక తేపుతేపి బయటుప్రక్కన క్రింద కూర్చోవాలి.) మా బుల్లెమ్మగోరి వంట ఎంతబాగుంది. అహా సదువుతోపాటు వంటకూడ నేర్చుకుంది. (అని నిలబడి ఫోటోల వంక చూస్తూ ఆశ్చర్యం చెందుతూ ఉంటాడు. ఒక ఫోటోను తీసి) అరె! ఇద్దరు పెసాదుగోరులానే ఉన్నారే! బహుశ కవల పిల్లలనుకుంటు, చేతులు కలుపుకున్నారు. (మళ్ళీ ఫోటోను తగిలించును. ఇంతలో ప్రసాదు, భాస్కర్ వచ్చి కూర్చుందురు. సుబ్బన్న వాళ్ళదగ్గరకొచ్చి) పెసాదుబాబుగోరు మీ అన్నగోరు ఏం చేత్తారు?

ప్రసా: మా అన్నయ్య ఎవరు?

సుబ్బ: అదే బాబు తమ్ముడుగోరు కావాలా

ప్రసా: నాకు అన్నా తమ్ముడు ఎవరులేరే!

భాస్క: నీకు ఎవరు చెప్పారు అన్న ఉన్నాడని ?

సుబ్బ: అదేటి బాబు (అనిఫోటోతీసుకొచ్చి చూపిస్తాడు.) ఇదిగో బాబు నన్ను అబద్దమాడిత్తారు?

ప్రసా. (ఫోటోచూసి) ఓస్ యిదా! ఇది డబల్ ఫోజు. ఫోటోతీసే వాడు మ్యాజిక్‌గా తీస్తాడు.

సుబ్బ: (ఫోటోతీసుకొని) అన్నన్నా! కాలం ఎంతగా మారిపోయింది. బెమ్మంగోరు శెప్పినట్టుగా జరుగుతానే ఉందిబాబు.

(యిద్దరూ నవ్వుతారు. యింతలో డాక్టర్ వస్తాడు.)

డాక్ట: ఏమిటి బావ బావమర్దులు నవ్వుతున్నారు?

భాస్క: గుడ్ ఈవినింగ్ డాక్టర్

డాక్ట: గుడ్ ఈవినింగ్

ప్రసా: ఎప్పుడొచ్చారు?

డాక్ట : యిప్పుడే వచ్చాను. ఏమిటి హడావుడిగా ఉన్నారు.

ప్రసా: ఈ వేళ మాచెల్లి వెడుతుంది డాక్టరుగారు. భగవంతుని దయ వలన ఈ వేళతో మా కష్టాలు కొన్ని తీరినవనుకుంటున్నాను వాళ్ళ మామగారే రమ్మని వాళ్ళసర్వెంటును పంపించారు.

డాక్ట: సరోజ ఎప్పుడు అదృష్టవంతురాలె.

ప్రసా: సరోజా ఇలారామ్మ?

సరో: (వచ్చి) నమస్తే డాక్టరుగారు.

డాక్ట: ఏం సరోజ ఈ వేళ ఊరు వెళుతున్నారటుగా?

సరో: అవునండి ఇప్పుడే వెళుతున్నాం, వస్తానుండండి. (అని లోపలికి వెళ్ళును.)

భాస్క: సుబ్బన్నా? లోపలికెళ్ళి సామానది బయటపెట్టు.

సుబ్బ: అలాగే బాబుగోరు.

ప్రసా: డాక్టర్‌గారు అవూరు వెళితే అప్పుడప్పుడు మా చెల్లెల్ని చూస్తూ ఉండండి. వాళ్ళ కబుర్లని తెలుస్తుంటుని. (ఇంతలో సరోజకాఫీ తెస్తుంది.)

సరో: కాఫీ తీసుకోండి డాక్టరుగారు.

డాక్ట: (చిన్నునవ్వునవ్వి) కాఫీ మట్టుకు మర్చిపోవు. నీవు తయారు చేసిన కాఫీ ఎంత తేస్టుగా ఉంటుంది. ఎక్స్‌పీరియన్స్ హోటల్ వర్కర్‌కూడా తయారు చేయలేడు.

సరో: పోండి డాక్టర్‌గారు. మీరు ఎప్పుడు ములగచెట్టు ఎక్కిస్తారు.

డాక్ట: నేను ఎక్కించిన చెట్టు పెళుసుకాదు. సరోజ చూడు, నీకు మంచిబుద్ధిమంతుడు, కోరుకున్న భర్త వస్తాడన్నాను. అలాగే వచ్చాడు.

సరో: అవును డాక్టర్‌గారు, యిది నా అదృష్టం.

సుబ్బ: (పెట్టి బ్యాగ్ తీసుకొని వస్తాడు.) అన్నీ లదీసేశాను. అయ్యగోరు.

భాస్క: సరోజా, తొందరగా కాని.

సరో: ఇంక ఆలస్యం ఏముంది?

భాస్క: (లేచి) వస్తాను బావా?

ప్రసా: (బాధతో) భాస్కర్ సరోజను నీ చేతుల్లో పెడుతున్నాను. ఎలాచూసుకుంటావో ఏమో? బాగా చదువుకున్న వాడివి. నీకు చెప్పనవసరంలేదు.

భాస్క: పరవాలేదు బావా! నా ప్రాణంకంటే సరోజను బాగా చూసుకుంటాను.

సుబ్బ: (పెట్టి సంచి తీసుకొని) మీకు ఆ బెంగేమివద్దు పెసాదు బాబుగోరు. సరోజనమ్మగోరి వంటిమీద ఈగనుకూడా వాలనివ్వమ్ బాబు.

సరో: (బ్రతిమాలుతూ) అన్నయ్యా! మందు తీసుకుంటు ఉండ న్నయ్యా, నా కెప్పుడు నీ ఆరోగ్యం గురించే దిగులు. సరిగ్గా మందు తీసుకోవు, వేళకు భోజనం చేయవు, ఏదో ఎప్పుడు ఆలోచిస్తూ ఉంటావ్. నా ఆరోగ్యము, నా సుఖముతప్ప నీ సుఖాన్ని గురించి ఒక్కక్షణమైనా ఆలోచించవు. ఇక నుంచి అయినా నీ ఆరోగ్యము జాగ్రత్తగాచూసుకో అన్నయ్య (అని కంటతడిపెట్టి కాళ్ళమీద పడును.)

ప్రసా: (ఉత్సాహం, బాధ) లేమ్మా, లే పిచ్చితల్లి, నాకు మందెందు కమ్మా, నీ నవ్వేనాకు మందమ్మా. నీవు కిలకిలాడుతుంటే ఎంత ఆరోగ్యంగా ఉంటానో మళ్ళీవచ్చి చూద్దువుగాని.

సరో: డాక్టరుగారు మా అన్నయ్యను జాగ్రత్తగా చూస్తూండండి. నమస్కారము వస్తానండి.

డాక్ట: ఏం పర్వాలేదు. వెళ్ళిరా సరోజా.

భాస్క: వస్తాం డాక్టర్‌గారు. బావా నీ ట్యూషన్సు మానేయరాదు. ఆరోగ్యం జాగ్రత్త, ఉత్తరాలు వ్రాస్తుండండి వస్తాము.

సుబ్బ: వత్తామండి పెసాద్‌బాబుగోరు, నమస్కారమండి డాక్టేరు బాబుగోరు (భాస్కర్, సరోజ, సుబ్బన్న వెడుతూ ఉంటారు, సరోజ వెనుకకు చూస్తూ నెమ్మదిగా వెడుతుంది)

ప్రసా: (బాధతో) అమ్మా! సరోజ (అని సరోజదగ్గరకు వెడతాడు.)

సరో: అన్నయ్యా (బాధతో వస్తుంది)

ప్రసా: ఈ అన్నయ్యను మాత్రం మర్చిపోకమ్మా.

సరో: (బాధతో) అన్నయ్యా! అంతమాట అనకన్నయ్యా. నీవుతప్ప నాకు ఎవరున్నా రన్నయ్యా! వస్తా నన్నయ్యా! వస్తాం డాక్టరుగారు.

ప్రసా: ఉత్తరాలు వ్రాస్తూ ఉండమ్మా !

(భాస్కర్, సరోజ, సుబ్బన్న వెళ్లును. ప్రసాదు వచ్చి కూర్చుంటాడు.)

డాక్ట: పాపం ఆ అమ్మాయి చనిపోవటంవలన వేళకు అన్నం తినక మనో వ్యాధితో ఆరోగ్యం పాడుచేసుకున్నావు. మళ్ళీ నీ చెల్లిగురించి ఆలోచించవద్దు. నీ చెల్లికి ఏలోటురాదు. నీవు ధైర్యంగా ఉండు. మంచిడైట్ తీసుకో. ఆ టానిక్ త్రాగుతూ ఉండు. ఆఁ అప్పుడప్పుడు నేనువస్తూ ఉంటాను. (లేచి) వస్తాను. ప్రసాద్, సరోజను నే వెళ్ళినప్పుడల్లా చూచి వస్తాను. ఊఁ.

ప్రసా: మంచిది వెళ్ళిరండి డాక్టర్.

[తెర పడును]

# 3

(తెరలేచేసరికి నారాయణరావుగారు కుర్చీలో బాధతో కూర్చుని కొంచం దగ్గుతూ ఉంటాడు.)

పర : (లోపలనుంచివచ్చి) ఒవల్‌టిన్ తీసుకోండిబాబు, ఈ వేళ తప్పకవస్తారు. మనసుబ్బన్న వెమ్మటుపెట్టుకు తీసుకొస్తాడు. అదిగాక పేపరన్నా చూస్తారు. మీరు బాధపడకండి. భోజనం కూడాలేదు, కనీసం ఇవన్నా త్రాగండి.

నారా: (దిగులుతో ఒవల్టిన్ తీసుకుంటూ) పరమానందం, నాబాబు వస్తాడంటూవా? వాడిసలే పట్టుదల మనిషి.

పర : అదేంటిబాబు భాస్కర్‌బాబు తప్పక వస్తారు.

(వెంటనే ముగ్గురూ వస్తారు.)

పర : అదుగో భాస్కర్‌బాబు, సరోజమ్మ అనుకుంటాను.

భాస్క: (దుఃఖముతో కాళ్ళుపట్టుకొని) నాన్నా! ఎలా ఉంది నాన్నా వంట్లో! మానేజర్ డాక్టర్‌ని పిలిపించారా ?

పర : ఆఁ రోజు వస్తున్నారు, రోజు మందిస్తున్నారు, రోజు వ్యాధి అలాగే ఉంటుంది: రోజు డాక్టర్ తగ్గుతుంది అంటూనే ఉంటారు. ఫలితం శూన్యం.

సరో: (మావగారి కాళ్ళదగ్గరపడి బాధతో) మావయ్యా! నా తప్పేమయిన ఉంటే మన్నించండి. అనవసరంగా నన్ను గురించి మీకు కష్టాలు వచ్చినవి.

నారా: లేమ్మా లే! విధినిర్ణయం ఎవరం తప్పించలేము.

సుబ్బ: (ఉత్సాహముతో) పెదబాబుగోరు, సరోజమ్మగోరు శాలా మంచిదండి. దోవమ్మటే మిమ్మల్నిగురించే బాధపడుతున్నారు బెంగతో అన్నంకూడ ముట్టలా.

పర : (సుబ్బన్న బుజంమీద చేయివేసి మెల్లగా) యిదిగో సుబ్బన్నా సరోజ అంటే ఈమేనా.

సుబ్బ: (బిగ్గరగా) అవును మేనేజరుగోరు! మా బుల్లెమ్మగోరు. (అని నవ్వుతూ వెడతాడు)

పర : ఛీ, యిలా అరుస్తాడేరా! (నెమ్మదిగా) వెధవ, నిన్నడగడమే బుద్ధితక్కువ.

భాస్క: సరోజా, నాన్న చాలచిక్కిపోయారు. మంచిడాక్టర్ని తీసి కొస్తానుగాని నీవు నాన్నగార్ని చూస్తూఉండు.

సరో: ఎందు కండి, మనడాక్టర్‌గారు ఫారన్‌కూడా వెళ్ళారు. వారిని పిలిపించకూడదు. వారైతె త్వరగా నయంచేయగలరు.

భాస్క: అవును యిదిగో మానేజర్, ఈ అడ్రసుకు టెలిగ్రాం యివ్వు. యిదిగో అడ్రస్. (అనిచీటీ యిస్తాడు) డాక్టరగార్ని త్వరగా రమ్మను.

పర : అలాగేబాబు (చీటితీసుకుని వెడతాడు, సరోజకూడా లోపలకు వెళుతుంది.)

నారా: బాబు! యిలారా బాబు!

భాస్క: ఏమిటి నాన్నా?

నారా: నా ఆరోగ్యమా సరిగాలేదు. ఆ పార్టనర్ కా బాధ్యతతెలియదు. పాపం నామీదే అంతా వదిలి పెట్టేవాడు. ఈ మానేజర్ అంటావా వట్టి చెమిటిమేళం. ఏమిటో, చూడబోతె మన కంపెనీకాస్తా దివాళా తీసేటట్లుగా ఉన్నది. యికమన కంపెనీ విషయాలన్నీ నువ్వే చూసుకో. వర్కర్సుతో చాలా జాగ్రత్తగా మెలగాలి సుమా!

భాస్క: అలాగే నాన్నా!

నారా: మీ రిద్దరు చాలా జాగ్రత్తగా మన కంపెనీని పైకి తీసుకురావాలి. పాపం రామారావుకి మనముంటే పంచప్రాణాలు. మీ రిద్దరు ఆఫీసులో ఉన్నప్పుడు, వెయ్యికళ్ళతో సంచరించాలి తెలుసా! ఎలా నెట్టుకొస్తారో ఏమో! రామారావుకి నేను లేకపోతె అసలుధైర్యమే ఉండదు.

భాస్క: అలాగేనాన్నా. అవన్నీ మేం చూసుకుంటాంగా (అనిలోప లికి వెళతాడు. యింతలో రామారావు ప్రవేశము.)

రామా: నమస్తే నారాయణరావుగారు. ఎలా ఉంది ఆరోగ్యం, భాస్కర్, సరోజ వచ్చారటగా, యికమీరు ఏ బెంగపెట్టు కోవద్దు. నారాయణరావుగారూ నా కొక చిన్నకోరికకల్గింది. చేద్దామా?

నారా: ఏమిటి నాయనా? కూర్చో.

రామా: (కూర్చుని) ఒక డిన్నర్ యిద్దామని ఉంది, ఈ శుభసమ యంలో.

నారా: యిప్పుడేం అలాంటివి పెట్టుకోవల్చుకోలేదుబాబు. అదిగాక నా ఆరోగ్యం సరిగాలేదు. యిక నేనుకంపెనీకి రాలేను. అబ్బాయివస్తాడు జాగ్రత్త! వాడికి తెలియని విషయాలు చెపుతూఉండు. నిన్ను మీనాన్నగారు ఉన్నప్పటి నుంచి బిడ్డలాగా చూసుకుంటున్నా! యిద్దరూ శ్రద్ధతో చూసుకోండి. జాగ్రత్త వేయికళ్ళతో మెలగాలి.

రామా: (ఆశ్చర్యంగా) ఏమిటి? భాస్కర్ వస్తున్నాడా! యిద్దరం కొత్తవాళ్ళం ఉంటే ఎలాగు చెప్పండి. మంచి డాక్టర్ని పిలిపించి మందు తీసుకోండి. మీరు రాకపోతె కంపెనీ దెబ్బ తింటుంది.

నారా: ఎప్పుడూ నేనే చూసుకోవాలంటే కష్టం కదూ! మీరు ఎప్పుడు కుర్రవాళ్ళలాగా నేఉంటే ఎట్లా? అప్పుడప్పుడువస్తూ ఉంటా ననుకోండి.

రామా: మీరు కనీసం రోజుకు ఒక్కసారైన వచ్చి వెళ్ళాలి. ఏడి భాస్కర్.

నారా: లోపలున్నాడు. ఒరేయ్ భాస్కర్ బాబు?

భాస్క: వస్తున్నా నాన్నా! (రామారావు వంక చూసి) నమస్కార మండి రామారావుగారు.

రామా: నమస్తే! చూడు భాస్కర్, నాన్నకు ఆరోగ్యం బాగాలేదు. నిన్నుగురించే బెంగతో సరిగా భోజనం చేయకపోవడం వలన యిలా అయ్యారు. మంచి డాక్టర్‌ని పిలిపిస్తే రైటు.

భాస్క: సరోజ వాళ్ళ డాక్టర్‌కు టెలిగ్రాం యిచ్చాం. బహుశా వస్తూ ఉండాలి. ఆయన పెద్దడాక్టర్, ఫారన్ కూడా వెళ్లారు.

రామా: వెరిగ్లాడ్, అన్నట్లు కులాసా?

భాస్క: ఆఁ పర్వాలేదు. (డాక్టర్ వస్తాడు) హలో గుడ్ ఈవినింగ్ డాక్టర్‌రండి కూర్చోండి! వీరు మా నాన్నగారు. వీరు మా కంపెనీ పార్టనర్ రామారావుగారు.

డాక్ట: నమస్కారం నారాయణరావుగారు.

రామా: నమస్తే డాక్టర్.

డాక్ట: నమస్తే, వెరిగ్లాడ్ టు సి యు (సెకండు ఇచ్చుకుంటారు.)

భాస్క: సరోజ! సరోజ! డాక్టర్‌రఘుగారు వచ్చారు.

సరో: వస్తున్నానండి! (వచ్చి డాక్టర్‌నిచూసి సంతోషముతో) ఆఁ డాక్టర్‌గారా! నమస్తే? మా అన్నయ్య కులాసా డాక్టరుగారు.

డాక్ట: పర్వాలేదు, అలాగే ఉన్నాడు.

సరో: మా మాఁవగార్కి మరీ వంట్లోబాగుండ లేదండి. అందుకనే మిమ్మల్ని రమ్మని టెలిగ్రాం యిచ్చాం.

డాక్ట: (నారాయణరావుగార్ని పరీక్షచేసి) భాస్కర్ కాసిని వేడినీళ్ళు పట్రామను.

సరో: సుబ్బన్నా? సుబ్బన్నా? కాసిని వేడినీళ్ళు పట్రా.

సుబ్బ: (ప్రవేశము) ఇదిగోండి బుల్లెమ్మగోరు (వేడినీళ్ళుయిచ్చి డాక్టర్‌వంక చూస్తు) నమస్కారం డాక్టర్‌బాబుగోరు.

డాక్ట: (చిరునవ్వునవ్వి) ఆఁ నమస్తే! (బ్యాగ్‌లోనుంచి సిరంజితీసి కడిగి సీసా నుంచి మందులాగి దగ్గరకు వెళ్ళి) యిదిగో యింజక్షన్ తీసుకోండి (యింజక్షన్ యిచ్చిన తరువాత) బాగా రెస్టుతీసుకోవాలి. ఊపిరితిత్తులలో నిమ్ము ఉన్నది.

ట్యాబ్లెట్సు యిస్తాను. యివి రోజుకు మూడువేయండి. (బ్యాగ్‌లో టానిక్, బిళ్ళలుతీసి) సరోజా ఈ టానిక్ భోజనం అయినతరువాత రెండు మూడు సార్లు యివ్వు. (సుబ్బన్న వెడతాడు.)

సరో: అలాగే డాక్టర్‌గారు. (లోనికిపోయి కాఫీ తెస్తుంది)

రామా: డాక్టర్, వీరికి త్వరగా నయంచేయాలి. డబ్బు ఎంతయిన పర్వాలేదు. వీరులేకపోతె మా కంపెని ఆగిపోయేటట్టుగా ఉంది.

డాక్ట: ఓ యస్, అలాగే.

భాస్క: వీరు మా బావమర్ది క్లాస్ మేట్.

రామా: అందుకనేగా ఎంతదూరమైన అర్జంటుగా వచ్చారు.

డాక్ట: నేను బహుశ కొద్దిరోజులలో మీకు ఒక ఆరుమైళ్ళ దూరం లోకి వస్తాను. కరీంపేటలో స్థలంకొన్నాను. నర్సింగ్ హొమ్‌కి బిల్డింగ్ కట్టిస్తున్నాను.

రామా: రండి మీలాంటివారు మాకు దగ్గరగా ఉండటం చాలా మంచిది.

భాస్క: తప్పకరండి డాక్టర్ ! యిక్కడ చాలా బాగుంటుంది.

డాక్ట: వస్తాను నారాయణరావుగారు, ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి. మీరు బాగా రెస్టు తీసుకోవాలి.

నారా: అలాగేనండి శ్రమఅనుకోకుండగ నన్ను చూసిపోతూవుండాలి.

డాక్ట: ఫర్వాలేదు, నేను రోజుకొకసారి వచ్చి చూస్తాను. ఎక్కువగా ఏది అలోచించవద్దు.

భాస్క: ఈపూట ఉండండి డాక్టర్, తర్వాత వెళ్ళొచ్చు.

డాక్ట: నో! థాంక్స్. త్వరగా వెళ్లాలి. (సరోజ ప్రవేశము.)

సరో: కాఫీ తీసుకోండి డాక్టర్‌గారు?

భాస్క: సరే, కాఫీ అయినా తీసుకోండి (అని డాక్టర్‌కి యిచ్చి) తీసుకోండి రామారావుగారు (రామారావు తీసుకుంటాడు.)

రామా: నేను వస్తాను నారాయణరావుగారు. యిదిగో భాస్కర్ రేపటినుంచి కంపెనీకి వచ్చెయ్. వస్తాను డాక్టర్. (అని వెళ్ళి పోవును.)

డాక్ట: వస్తాను సరోజ, మీ మావగార్ని జాగ్రత్తగా చూస్తూ ఉండు. (లేచి)

సరో: ఈ పూట ఉండండి డాక్టర్‌గారు.

డాక్ట: లేదు సరోజ త్వరగా వెళ్ళాలి. (పోబోతాడు.)

సరో మా అన్నయ్యను జాగ్రత్తగా చూడండి డాక్టర్‌గారు

డాక్ట: మా యింట్లో ఉండి మందు తీసుకోమన్నానుకాని వినడు సరోజా.

భాస్క: మా బావను శ్రద్ధతో చూడండి. (అని డబ్బుతీసి 100 రూ॥ యివ్వబోతాడు )

డాక్ట: ఏమిటి భాస్కర్ యిది! ఏమీవద్దు, యింకానయం, అయితే మీ యింటికేరాను.

సరో: పర్వాలేదు తీసుకోండి.

భాస్క: తీసుకోండి డాక్టర్, అంత దూరమునుంచి వచ్చారు. మందులు ఫ్రీగా ఎందుకు డాక్టర్.

డాక్ట: క్షమించండి, ఏమీవద్దు వస్తాను. వస్తాను నారాయణరావు గారు. వస్తాను భాస్కర్, సరోజ. (రెండడుగులు బయటకు వేస్తాడు. సరోజ అక్కడకు వస్తుంది.) సరోజా! మీ అన్నయ్య పరిస్థితి ఏమీ బాగోలేదు. త్రాగుడు కూడా అలవాటయ్యాడు.

సరో: (కొంచం బాధతో) డాక్టర్ !

డాక్ట: పైగా మందు నాకెందు కంటాడు. బహుశ నిదానంగా యిక్కడకే రప్పించే ఏర్పాటు చేయి.

సరో: (బాధతో) ఏమను కుంటారో డాక్టర్, ప్రయత్నించి చూస్తాను.

డాక్ట: ఆఁ వస్తా! ధైర్యంగా ఉండు. (అని వెళ్ళిపోవును.)

సరో: (విచారంతో లోపలికి పోవును )

భాస్క: సుబ్బన్నా? (సుబ్బన్న వస్తాడు.) నాన్నగార్కి లోపల పక్క వేశావా ?

సుబ్బ: వేశాను బాబుగోరు! రండి పెదబాబుగోరు. (రెక్క పట్టుకొని యిద్దరు లోపలికి తీసికెళ్ళుదురు.)

భాస్క: సరోజా! సరోజా?

సరో: వస్తున్నానండి (వచ్చి) ఏమిటండి?

భాస్క: సరోజ రేపటినుంచి నేను కంపెనీ పనులు చూసుకోవాలి యింటి వద్ద నాన్నగార్ని నీవే చూసుకోవాలి.

సరో: మీరు చెప్పాలండి! మావయ్యగారు నాకు తండ్రిలాంటివారు. వారికి సేవచేసే భాగ్యం కలిగింది, ఎంత అదృష్టవంతురాల్నో.

భాస్క: సరోజా! నీవు నా అదృష్టంకొద్ది దొరికావట, మన సుబ్బన్న అంటాడు.

సరో: (గారాబంగా) ఊఁ కాదామరి.

భాస్క: మరి నేనో...

సరో: మీరూను. (యిద్దరు నవ్వుతారు.)

భాస్క: (బిగ్గరగా) సుబ్బన్నా! (నెమ్మదిగా) సరోజా సుబ్బన్నని నీళ్ళు కాగాయేమో అడుగు. (సరోజ లోపలికి పోవును. భాస్కర్ కూడా పోవును. నారాయణ ప్రవేశం.)

నారా: (నారాయణరావు వచ్చి కుర్చీలో కూర్చుని అక్కడ పేపరు చూస్తూ ఉంటాడు.)

పర: నమస్కారం పెదబాబుగోరు.

నారా: ఆఁ ఏమిటయ్యా ప్రొద్దున్నే యిలావచ్చావ్?

పర: ఆఁ ఏమిలేదు బాబు, రేపు... ...మా మేనత... ...

నారా: (నొసలు చిట్లించి) ఆఁ మేనత్త, ఏమిటి చెప్పవయ్యా అలా నిదానిస్తావేం?

పర : మా మేశత్త తద్దినం అండి తమరు ఒక వందరూపాయలు అడ్వాన్సుగా యిస్తారేమోనని వచ్చాను. (చెవిలో మిషను పడిపోతుంది.)

నారా: ఇదిగో పరమానందం తద్దినానికి 100 రూపాయలు ఖర్చు పెడతం ఎందుకయ్యా ?

పర : (చెవిటితో) ఆఫీసుడబ్బు ఖర్చుపెట్టుకో మంటారా ?

నారా: (మెల్లగా) దానికి మొనగాడివే (బిగ్గరగా) తద్దినానికి ఎందుకయ్యా అంతడబ్బు ఖర్చు.

పర : ఈ తద్దినంతో ఆపు చేస్తానండి.

నారా: వందలేదు, గింద లేదు. ఒకయాభై తీసుకో!

పర : (మిషన్ పెట్టుకుంటాడు.) అలాగే బాబు (అని వెడుతూ ఆలోచనగా) ముందలగానే రెండువందలడిగేపని, వంద యిచ్చేవారు. వందఅడగటం వలన యాభై ఇచ్చారు. (అని వెళ్ళిపోవును.)

నారా: (బిగ్గరగా) అమ్మాయ్ సరోజా కాసిని మంచి నీళ్లు పట్రామ్మా !

సరో: (మంచినీళ్ళతో) యిదిగోండి మావయ్యా, మందు త్రాగరా మావయ్యా ?

నారా: ఇప్పు డొద్దులేమ్మా, ఈ ఒక్కరోజుకు మానేస్తాను.

సరో: జబ్బు తగ్గొద్దు మావయ్యా (యింతలో డాక్టర్ ప్రవేశము.)

డాక్ట: నమస్తే నారాయణరావుగారు.

నారా: ఎవరు డాక్టర్‌గారా నమస్తే.

సరో: (చిరునవ్వు నవ్వి) నమస్తే డాక్టర్‌గారు.

డాక్ట. నమస్తే, నారాయణరావుగారు వంట్లో ఎలాఉంది?

నారా: పర్వాలేదు. దగ్గురావటంలేదు. సొలికూడ తగ్గింది.

సరో: (నవ్వుతూ) తమరిచెయ్యి పడటము, తగ్గకపోవడమా?

డాక్ట: మీ అన్నయ్య వచ్చాడా సరోజా

సరో: రాలేదు. డాక్టర్‌గారు యిటివద్ద లేడా? మా అన్నయ్య ఆరోగ్యం ఎలాఉంది డాక్టర్‌గారు.

డాక్ట: పర్వాలేదు! నిన్న వస్తానన్నట్లుగా చెప్పాడు. భాస్కర్ ఏడి ఎక్కడికి వెళ్ళారు.

సరో: డ్రస్ చేసుకుంటున్నారు.

డాక్ట: ఓహెూ కాసిని వేడినీళ్లు పట్రా, యింజక్షన్ చేస్తాను. (సరోజ లోపలికి వెళ్ళి వేడినీళ్ళతో వెంటవచ్చును.)

నారా: ఇంకా యింజక్షన్ కావాలా డాక్టర్? ఎందుకు తగ్గిందిగా మందుతో సరిపెట్టండి.

డాక్ట: పూర్తిగా తగ్గొద్దు! యింకా రెండు మూడు చేసి ఆపుచేస్తాను. ఏం మీకు బాధగా ఉన్నాయ్యా?

నారా: లేదు లెండి.

డాక్ట: ఆఁ యింజక్షన్ పట్టండి. (అని యింజక్షన్ చేస్తాడు.)

సరో: మీ క్రొత్త హాస్పటల్ ఎప్పుడు ఓపెన్ చేస్తారు డాక్టర్?

డాక్ట: నేను చెప్పబోతుంటే మీరే అడిగారు. రేపే మంచిదట, యిన్విటేషన్ యిచ్చినట్లు ఉంటుందని వచ్చాను, యిదిగో యిన్విటేషన్ (అని సరోజకిచ్చును,) నువ్వుభాస్కర్ తప్పని సరిగా రావాలి. మీరురావాలి నారాయణరావుగారు

నారా: నేను రాలేనులె డాక్టరుగారు. అబ్బాయి వాళు వస్తారుగా

సుబ్బ: (ప్రవేశించి) పెదబాబుగోరు నీళ్ళు కాగాయండి.

నారా: కాసే పాగు డాక్టరుగార్ని కూర్చోబెట్టి.......

డాక్ట: పర్వాలేదు, వెళ్ళిరండి. భాస్కర్‌తో కూడా మాట్లాడి వెళ్లతాను.

సరో: డాక్టర్! నిన్నమా అన్నయ్యరాలేదు, వస్తానని మీతోచెప్పాడా!
(సుబ్బన్న, నారాయణరావు వెళ్ళును.)

డాక్ట: అవును. నిన్న చెప్పాడు: ఏమిటో ఎప్పుడు ఏదో ఆలోచిస్తూ ఉంటాడు. నీ వంటే మీ అన్నయ్యకు పంచప్రాణాలు. నేను వెళ్ళంగానే ఎప్పుడూ మా చెల్లెలు ఎలాఉంది. నేను బ్రతకక పోయినా నా చెల్లి బాగుంటే నా కదే చాలంటాడు.

సరో: (బాధతో) దయచేసి మీరొక సహాయము చేస్తారా?

డాక్ట: ఏమిటి సరోజ చెప్పు.

సరో: (బాధతో) మా అన్నయ్యను చూడాలని ఉంది. ఒక్కసారి రమ్మనండి, త్రాగుడు మానేటట్లు చూడండి డాక్టర్‌గారు. మాకు మీరే దైవం లాంటివారు.

డాక్ట: నువ్వేం బాధ పడకు సరోజ. నేను చెవుతాను సాధ్యమైనంత వరకు మానిపిస్తానికే ప్రయత్నిస్తాను.

సరో: డాక్టర్ నన్ను మా అన్నయ్య తన కష్టార్జితంతో చదివించాడు. మళ్ళీ మా అన్నయ్య మంచి మార్గంలో పడేంతవరకు నాకు మనశ్శాంతి ఉండదు డాక్టర్ మనశ్శాంతి ఉండదు.

డాక్ట: మీ వదిన ఉన్నట్లయితే మీ కిన్ని కష్టాలు వచ్చేవికావు సరోజ.

సరో: నాకు మరీ బాధగా ఉంది డాక్టర్. మీరు అవూళ్లో ఉండటం లేదు, యిప్పుడు మా అన్నయ్య ఏ మౌతాడో మరీ భయంగా ఉంది డాక్టర్‌గారు.

డాక్ట: ఏం పర్వాలేదు. అధైర్యపడకు (అని ఆలోచించి) ఈ సంగతి భాస్కర్‌తో చెబితే......

సరో: (భయంతో) వద్దు డాక్టర్ బావమర్ది ఇలాంటి వాడని తెలిస్తే వారు బాధపడతారు. యిక దానమ్మకే అనేకమైనవి వస్తవి.

డాక్ట: భాస్కర్ అలాంటి వాడుకాదనుకో, అయినా యిప్పుడు చెప్పొద్దులె.

సరో: (నెమ్మదిగా) అదుగో ఆయనొస్తున్నారు. (అనితలవంచి బాధతో ఉంటుంది)

భాస్క: (చెమట సవరించుకుంటు ప్రవేశిస్తాడు.)

డాక్ట: హల్లో భాస్కర్ రండి.

భాస్క: ఎక్స్క్యూజ్‌మి డాక్టర్, కొద్దిగా ఆలస్యమైంది. ఎంత సేపయింది మీరొచ్చి?

డాక్ట: యిప్పుడే పదినిమిషా లయింది.

భాస్క: రేపే నటుగా మీ హాస్పటల్ ఓపెన్ డే!

డాక్ట: అవును రేపే అందుకే మీకిన్విటేషన్ యివ్వటానికి వచ్చాను.

భాస్క: మా ప్రసాద్ ఎలా ఉన్నాడు? ట్యూషన్స్ మానేశాడా?

డాక్ట: చాలా కట్టుకు మానేశాడు. ఆర్థికపరిస్థితులవలన పూర్తిగా మానేయలేక పోతున్నాడు

భాస్క: డబ్బు ప్రతినెలా నేను పంపిస్తాను. దయచేసి ట్యూషన్స్ పూర్తిగా మానేయమని చెప్పండి.

డాక్ట: (కుర్చీలో నుంచి లేచి) అలాగె, నే వస్తాను. ఆఁ రేపు మీ రంతా తప్పకుండా రావాలి.

సరో: భోంచేసి వెళ్ళండి డాక్టరుగారు.

భాస్క: అవును డాక్టర్ భోంచేసి వెళ్ళండి,

డాక్ట: నా కర్జంట్ కేసెస్ వున్నాయి వస్తాను. ఆఁ వస్తా సరోజ.

సరో: నమస్తె (డాక్టర్ వెళ్ళిపోవును.) (సరోజ విచారంతో ఆయన వెళ్ళినవైపే చూస్తుంది.)

భాస్క: సరోజ! (పలకదు)

భాస్క: సరోజా!

సరో: (తృళ్ళిపడి) ఆఁ ఏమండి?

భాస్క: ఏమిటి అలాఉన్నావ్ కళ్ళు ఎర్రగా ఉన్నాయ్ ఏమిటి?

సరో: ఏమిలేదండి, వేడి చేసినట్లుంది.

భాస్క: (మెల్లగా) నేనేమన్నా చిన్నపిల్ల గాడ్నా, మభ్య పెట్టటానికి, కాదు. నీవేదో బాధపడుతున్నావ్ నాన్నగారేమన్నా కోప్పడ్డారా?

సరో: (లేని సంతోషము తెచ్చుకొని) అబ్బే ఏమి లేదండి మా వఁయ్య చాలా మంచివాడు.

భాస్క: అయితే మీ అన్నయ్యను చూడాలని ఉందా?

సరో: (కొంచం బాధగా) అవునండి.

భాస్క; ఎందుకు బాధ, నన్నడిగితే పంపనూ, ఛీ. తప్పు అలా బాధ పడకు. ఎల్లుండి వెళ్ళదువుగానిలే ఇక బాధపడకు.

సరో: అలాగె నండి.

భాస్క: ఏది నవ్వు. ఊఁ, నవ్వమంటుంటే.

సరో: (నవ్వుతూ) టిఫెన్ తీసుకుందురుగాని, టయమయింది రండి.

భాస్క: నీవు నవ్వుతూ ఉంటే నాకు టిఫెన్, భోజనం ఏమి అవసరం లేదు.

సరో: (చిలిపిగా) అయితే నే నెప్పుడు నవ్వుతూ ఉంటే మీకు భోజనం అవసరం లేదుగా.

భాస్క: (నవ్వుతూ) సరూ యిలారా (దగ్గరకొస్తుంది) దగ్గరకు తీసుకుంటూ, (తన్మయత్వంలో) ఆఫీసులో ఉన్నా ఎక్కడున్నా నీ కళ్ళు నా కళ్ళల్లో నాట్యం చేస్తుంటాయి సరూ!

సరో: (ఓరకంటితో) అయితే మీ కళ్ళేం చేస్తుంటాయో?

భాస్క: (తన్మయత్వంతో) నీ కళ్ళు నాట్యం చూస్తూ నా కళ్ళు మురిసిపోతాయ్.

సరో: ఊఁ అలాగా! (అని తన్మయత్వంలో యిద్దరు కౌగలించుకుంటారు. సుబ్బన్న రాగానే విడిపోతారు.)

సుబ్బ (ప్రవేశించి) పెదబాబుగోరు రమ్మంటున్నారు బాబు.

భాస్క: రా సరోజ త్వరగా ఆఫీసుకెళ్ళాలి. (అని యిద్దరు లోనికి వెడరారు. సుబ్బన్న కుర్చీలవి తుడుస్తూ ఉంటాడు. యింతలో పరమానందం ఫైల్స్‌తో వస్తాడు.)

పర : సుబ్బన్నా! భాస్కర్‌బాబు ఉన్నారా?

సుబ్బ: ఉన్నారుబాబూ అమ్మాయిగోరి పెళ్ళిఏమయింది బాబూ.

పర : (యిసుగుతో) అబ్బ ఉండు, పెళ్ళిలాగానే వుంది నాపని.

సుబ్బ: ఏమిటిబాబూ అలా యిసుక్కుంటారు. ఏదో గొడవలో ఉన్నట్టుఉన్నారు.

పర : పెద బాబు గారి ఆరోగ్యం ఎలా వుంది.

సుబ్బ : కొంచం పర్వా లేదు బాబు గోరు. అదుగో పెదబాబు గోరు (అని లోపలికి వెడతాడు. నారాయణరావు ప్రవేశం.)

పర: నమస్కారం పెదబాబుగారు.

నారా : ఆఁ ఏమిటయ్యా పరమానందం.

పర : సంతకాలు చెయ్యాలి బాబు.

భాస్క : (వచ్చి) ఆఁ పద పరమానందం. వస్తాను నాన్నా (వెళ్ళును, పరమానందం వెళ్ళును.)

[తెర పడును]

4

(తెర లేచేసరికి నారాయణరావుగారు కుర్చీలో కూర్చుని ఉంటారు.)

నారా : సుబ్బన్నా! లోపల ఈవేళ పేపరుందిగాని తీసుకురా.

సుబ్బ : (లోపలనుండి పేపరుతో ప్రవేశించి) ఇదిగోండయ్యా ?

నారా : సుబ్బన్నా ? సరోజకి అన్నయ్యెవరో ఉన్నారటగా. ఏం చేస్తాడు ?

సుబ్బ : ఏదో సెప్పేరండి. ఊఁ.. టూటం శెబుతారకుండి.

నారా : టూట నేంటిరా ? అది సరేకాని ఏమిచెప్పాడు వాళ్ళన్న ?

సుబ్బ : ఇదిగో పెదబాబుగోరు. పెసాద్‌బాబుగోరంత మంచోర్ని ఎక్కడా చూడలేదండి.(ఆశ్చర్యంగా) చినబాబుగోరంతే. ఎంత గౌరంవండి. మీకు దండాలు సెప్పారుండి.

నారా: నీకు బాగా పొట్టనిండా పెడితే చాలు, వాడంత మంచివాడు లేడంటావ్. మంచో చెడ్డో సరేకాని, నిన్నే వస్తానందట ఇంకా రాలేదే!

సుబ్బ : ఈవేళ రావచ్చు బాబుగోరు. (పరమానందం ప్రవేశం, సుబ్బన్న లోనికి పోతాడు.)

పర : నమస్కారం పెదబాబుగారు.

నారా : ఏమిటయ్యా ఇలా వచ్చావ్ ?

పర : భాస్కర్‌బాబు ఉన్నారేమోనని వచ్చాను.

నారా : ఆఁ ఉన్నారుకాని, షుమారు బ్యాలెన్సు ఎంత కనిపిస్తుంది ?

పర : ఇప్పటికి రెండులక్షలు కనిపిస్తుందండి.

నారా : పోయినేడు ఈ మార్చికి ఎంత బ్యాలెన్సు కనిపించింది ?

పర : 2 లక్షలన్నర దాదాపు కనిపించింది బాబు.

నారా : మరి యిప్పుడు యింత తగ్గటానికి కారణం ?

పర : మ్యానిఫ్యాక్చరింగ్ మిషన్ రిపేరులో ఉంది. అందుకని 10 రోజులు పని ఆగిపోయింది బాబు. (లోపలనుండి భాస్కర్ వస్తాడు.)

నారా : ఏరా భాస్కర్, మిషన్ రిపేరులో ఉంటే మార్చి క్రొత్తది తెప్పించవోయూరా ?

భాస్క : ఎందుకు నాన్నా ! రేపు మంచి యింజనీరు వచ్చి బాగు చేస్తాడు. క్రొత్తదానికన్నా బాగుంటుంది. మ్యానేజర్ నీ వెళ్ళు నే వస్తా !

పర : అలాగె బాబు (అని చూస్తూ) భాస్కర్ బాబు

భాస్క : ఆఁ ఏమిటి ?

పర : ఆఁ ఏమిలేదు, బాబు వస్తా (అని ఆలోచనగా వెడ్తాడు.)

నారా : యిదిగో భాస్కర్ ఈ మ్యానాజర్ తద్దినాలకని, పిల్లల పెళ్ళిళ్ళకని ఎప్పుడూ ఎప్పుడూ జీతంకంటే నాలుగురెట్లు బాకీ ఎక్కువగా చేస్తాడు. జాగ్రత్తా (భాస్కర్ నవ్వాలి) ఆఁ అది సరేకాని సరోజ ఫంక్షన్‌నించి అక్కడే వెళ్ళింది కదా యిన్ని రోజులైనా యింటికి రాలేదేమిటి ?

భాస్క : నిన్ననే రావలసింది నాన్నా. బహుశః ఈవేళ రావచ్చుభా. వస్తా నాన్నా, మందు త్రాగి రెస్టు తీసుకోండి. (భాస్కర్ వెడతాడు.)

నారా : అలాగే, వెళ్ళిరా జాగ్రత్తా. (రాజారావుగారు ప్రవేశం)

రాజా : (ప్రవేశించి) నమస్తే నారాయణరావుగారు.

నారా : నమస్తే (తల వంచుకొని బాధ అభినయం చేస్తాడు.)

రాజా : మీరు బాధ పడక్కర్లేదు. మీ అబ్బాయి ఇలా చేసుకున్నందుకు చాలా సంతోషిస్తున్నాను. ఈ రోజుల్లో యిష్టపూర్తిగా పెళ్ళిచేస్తేనే మంచిది.

నారా : మిమ్మల్ని శ్రమ పెట్టినందుకు క్షమించండి

రాజా : అబ్బే అదేంలేదు కాని, మీరు మరీ ఇలా అయిపోయారేం ?

నారా : లేవటం లేదండి. నిమోనియా వచ్చింది. అదికాక రక్తపోటు కూడ ఉంది.

రాజా : అందుకే యిలా అయ్యారు. నిమోనియా మనిషిని కృంగ

దీస్తుందండి. వెధవజబ్బు. నేను ఎంతో ఆశతో వచ్చాను, మా రాధకు పెళ్ళి, మీరు తప్పకుండ రావాలి. (అని యిన్విటేషన్ తీసి ఇచ్చును.)

నారా : (ఇన్విటేషన్ చదివి) అరె! నాల్గురోజు లుందన్నమాట. నేమ రాలేనందుకు ఎంలో బాధపడుతున్నాను.

రాజా : పోని మీ అబ్బాయిన్ని, కోడలిగార్ని పంపించండి.

నారా : అలాగే! సుబ్బన్నా కాఫీ తీసుకురా ?

రాజా : అబ్బే ఇప్పు డేమొద్దండి, వెళుతున్నాను.

సుబ్బ : కాఫీ (తీసుకొచ్చి యిస్తాడు) తీసుకోండి బాబుగోరు.

రాజా: (కాఫీతీసుకొని) భాస్కర్‌వాళ్ళని పంపించుతారుగా, వస్తాను. (వెళ్ళును.)

నారా : అఁ అలాగే (లోపలికి వెళ్ళును.)

(సుబ్బన్న కాఫీగ్లాసు పెట్టి వచ్చి బల్ల తుడుస్తూఉంటాడు.)

భాస్క : (ప్రవేశించి) సుబ్బన్నా ? ఏమిటి మరల రాజారావు వచ్చాడు కొంపతీసి......

సుబ్బ : అబ్బే మీకు పెళ్ళయిందిగా బాబుగోరు.

భాస్క : ఆయనకు నామీదే పిచ్చి పట్టుకుందనుకుంటూను.

సుబ్బ : ఏమిటో మిమ్మల్ని తప్పకుండగ పంపించమంటున్నారుండి.

భాస్క : పెళ్ళిచూపుల కేమో? (అని యిద్దరు నవ్వుతారు.)

భాస్క : సుబ్బన్నా కారు పంపించాను. సరోజ ఇంకా రాలేదా ?

సుబ్బ : రాలేదు బాబుగోరు ఇంకా ? అదిగో (సంతోషముతో) కారుమోత వినిపిస్తుంది. వచ్చారనుకుంటూనండి (సరోజ ప్రవేశం.)

సరో : (బ్యాగ్‌తో వస్తుంది) సుబ్బన్నా కారులో సామాను తీసుకురా (సుబ్బన్న వెళ్ళును.)

భాస్క : (అటు ముఖముపెట్టి కూర్చుండును.)

సరో : ఏవండి ? ఏమండోయ్ ? (పలుకడు.)

సరో : (దగ్గరకు వెళ్ళి) ఏం...కోపమా ? కోపమొచ్చిందా, త్వరగా రాలేదని ?

భాస్క : ఊఁ రాదా ఇన్ని రోజులైతె.
సరో : ఏం ఎన్ని రోజులు 4 రోజులేగా. (సామానుతో సుబ్బన్న బయటనుంచి లోపలికి వెళ్ళను.)
భాస్క : నీకు 4 రోజులే కాని నాకు 4 యుగాలు గడిచినట్లుంది.
సరో : మాఁవగారి వంట్లో బాగుందా ?
భాస్క : నర్సు లేకపోతే ఎలా బాగుంటుంది.
సరో : మీరు మరీను, రండి, భోంచేశారా?
భాస్క : నేనూ ఇప్పుడే వచ్చాను, (అని యిద్దరు లోనికి వెళతారు. మరల తిరిగి చేతులు తుడుచుకుంటూ వస్తాడు, సరోజ కూడ వెనకాల వస్తుంది.)
సరో : ఏమండి, మామగారు చెప్పిన పెళ్ళికి వెళదామా ?
భాస్క : అమ్మో, వద్దు ఆ పెళ్ళికే ?
సరో : (ఆశ్చర్యంగా) అదేమిటండి అలా అన్నారు !
భాస్క : ఏం లేదు, యిప్పుడు పెళ్ళయ్యే అమ్మాయిని నాకివ్వాలని ఆ పిల్లతండ్రి మా యింటిచుట్టు తిరగని రోజు లేదనుకో ! ఈయన వొక పెద్ద షావుకారు. అందుకే నాన్న మొదట్లో మన పెళ్ళికి అభ్యంతరం పెట్టారు, నేనుమట్టుకి ఆ యింటి ముఖం చూడలేదు.
సరో : (నవ్వుతూ) సరే అయితే !
భాస్క : సరేగాని సరోజ యిందాక కళ్ళు తిరిగినవి అన్నావేమిటి ?
సరో : ఏమోనండి నిన్న ఆలస్యంగా భోంచేశాను. డైజెషన్ కాలే దనుకుంటాను.
భాస్క : నే నేమనుకున్నానో తెలుసా ?
సరో : ఏమనుకున్నారు !
భాస్క : యిలారా చెపుతా (సరోజ దగ్గరకొస్తుంది, చెవిలో చెపుతాడు. ఇద్దరు నవ్వాలి,)
సరో : పోండి మీరు మరీనూ...
భాస్క : పోతాను, ఆఫీసు టయిమయింది. టాటా (అని వెళ్ళను.)

సరో : టాటా. (ఆదేత్రోవ చూస్తుంటుది. మరల పేపరు చూస్తుం డగా యింతలో రామారావు వచ్చును.)

రామా : భాస్కర్ లేడండీ ?

సరో : (షడన్‌గా లేచి) లేరండీ. యిప్పుడే ఆఫీసు కెళ్ళారు.

రామా : నారాయణరావుగారు ఏం చేస్తున్నారు.

సరో : నిద్ర పోతున్నారు.

రామా : మీ రెప్పుడొచ్చారు ?

సరో : యింతక్రితమే వచ్చాను.

రామా : డాక్టర్ గారు వస్తున్నారా ?

సరో : ఆఁ మాఁవగార్ని చూసి వెళుతున్నారు

రామా : మీ మాఁవగారు కులాసాగుంటే మాకు శ్రమ తగ్గుతుంది. అనుభవం కలవారు అన్ని చూసుకుంటారు. డాక్టర్‌గారుకూడ శ్రద్ధతో చూస్తున్నారు పాపం.

సరో : ఆయన ఎప్పుడూ అంతే! అందర్ని శ్రద్ధతో చూస్తారు.

రామా : మొన్న ఫంక్షన్‌లో చూశానుగా, చాలా మంచి హృదయం. వస్తానమ్మా!

సరో : ఉండండి కాఫీత్రాగి వెడుదురుగాని.

రామా : వద్దమ్మా. యిప్పుడే తీసుకున్నాను.

సరో : పర్వాలేదులేండి! (అని లోనికిపోవును.)

రామా : (జాలిగా) పాపం భాస్కర్‌కి కాకుండ చేయాలని చూశారు. నారాయణరావుగార్కి ఎప్పుడూ డబ్బే ముఖ్యం.

సరో : (కాఫీతో ప్రవేశించి) యిదిగో తీసుకోండి.

రామా : (తీసుకుంటూ) థాంక్స్. భాస్కర్ అదృష్టంకొద్దీ దొరికావమ్మా. యిది చెడకొట్టాలని ఎంతో చూశాడు వాళ్ళ నాన్న.

సరో : (మాట్లాడదు)

రామా : కాని యిప్పటికయినా మనస్ఫూర్తిగా మీ మాఁవగార్కి యిష్టంలేదు. ఎప్పుడూ నేను భాస్కర్ ఆదేశాలలోచిస్తాం. కాని

మీరు మట్టుకు మీ మాంవగారంటే అభిమానంగా ప్రేమతో ఉండండి. వీరికి డబ్బే ముఖ్యం. మనకు డబ్బేమయిన తక్కువయితే అనుకోవచ్చు. అంతకంపెనీ ఉండికూడా ఏమిటో! కాని భాస్కర్ చాలా బుద్ధిమంతుడు. నీకేం పర్వాలేదు. వస్తానమ్మా! (లేచి వెడతాడు)

సరో : (సంతోషముగా. జాలిగా) నమస్తే (అని కూర్చుని ఏదో ఆలోచిస్తూ ఉంటుంది, మరల వెంటనే వెళ్ళుతుంది. వెళ్ళిన తరువాత సుబ్బన్న ప్రవేశం,)

సుబ్బ : (వచ్చి కాఫీగ్లాసులు తీస్తుంటాడు. ఇంతలో నారాయణరావు ప్రవేశం.)

నారా : (కుర్చీలో కూర్చుని) యిదిగో సుబ్బన్నా!

సుబ్బ : అయ్యా!

నారా : నా కండువా యిలా యివ్వు, బయటకెళ్ళి రావాలి.

సుబ్బ : అలాగే బాబు. (అని సుబ్బన్న మరల లోనికి వెళ్ళి వచ్చి కండువా యిస్తాడు. వెనుక సరోజకూడ వస్తుంది. తర్వాత సుబ్బన్న లోనికి పోతాడు.)

సరో : మాంవయ్యా! డాక్టరుగారు మిమ్మల్ని నెలరోజులు బయటకు కదలొద్దన్నారు.

నారా : (కోపంతో) అందరూ కదలొద్దంటూరు. ఈ ఏడు ఏమిటో శని పట్టుకుంది. అంతా దురదృష్టమే, రాబడి తగ్గింది, వీళ్ళు చూద్దామా యిద్దరూ క్రొత్తవాళ్ళు, కాస్త ఆఫీస్ కెడతాను ఈవేళ డాక్టరుగ రొస్తే రేపు రమ్మని చెప్పమ్మా. (అని నారాయణ రావు వెళ్ళును.)

సరో : అలాగే (అని కూర్చుని ఆలోచిస్తుంది. బయట రామారావు మాటలు "మీ మాంవగార్కి యిప్పటికయిన మీరంటే మన స్ఫూర్తిగా యిష్టంలేదు. భాస్కర్ బుద్ధిమంతుడు, నీకేం పర్వాలేదు, వస్తానమ్మా." కొంచం దిగులతో ఆలోచనగా ఉంటుంది. ఇంతలో డాక్టర్ ప్రవేశము,)

డాక్ట : హాలో సరోజా ఏమిటి ఆలోచిస్తున్నావ్ ?
సరో : (తేరుకుని) ఆఁ...నమస్తే డాక్టర్‌గారు!
డాక్ట : ఏమిటి దిగులుగా ఉన్నావ్ !
సరో : అబ్బే ఏం లేదండి. అన్నయ్య ఏమిటా అలా అయ్యాడని.
డాక్ట : ఏమిటో సరోజా! ప్రసాద్‌సంగతి వూళ్ళో వాళ్ళందరికి తెలిసింది.
సరో : (కొంచం విచారముతో) డాక్టర్‌గారూ త్రాగుడు మాన్ప లేరా ?
డాక్ట : త్రాగుడు మనం మానమన్నా మానరు సరోజా! కాని వాళ్ళంతటికి వాళ్ళే ఏదో కారణంగా మానేస్తారు. నారాయణ రావుగారు ఏం చేస్తున్నారు ?
సరో ; ఇప్పుడే ఆఫీసు కెళ్ళారు. రేపు మిమ్మల్ని ఒక్కసారి రమ్మని చెప్పమన్నారు.
డాక్ట , (నొసలు చిట్లించి) బయటకు వెళ్ళొద్దని చెప్పానుగా !
సరో : నేను చెప్పాను. కాని ఆఫీసులో అర్జంటు పనుందని వెళ్ళారు.
డాక్ట : సరేకాని మీ అన్నయ్యకు ఏదైనా ఇక్కడ ఉద్యోగం చూస్తే......
సరో : త్రాగుడు మానందే ఉద్యోగం యిప్పిస్తె మీ పరువు పోతుంది.
డాక్ట : (లోపల వైపు చూసి) సరే అలాగే. సర్వెంట్సు ఎవరైనా వింటారేమో యిలా రా ఒకమాట చెపుతా.
సరో : (దగ్గరకు వెళ్ళి) ఏమిటండి ? (డాక్టర్ ఏదో నెమ్మదిగా చెపుతాడు. భయంతో) అమ్మో నాకు భయమేస్తుందండి ! (యిదే సమయంలో భాస్కర్, వెనుక పరమానందం వస్తారు!)
భాస్క : (వస్తూ) ఎందుకు భయం ? (సరోజ వణికిపోవును. డాక్టర్‌కూడా జంకును.)
పర : (వచ్చి) రాజారావుగార్ని చూస్తేనే భయం.

భాస్క : హలో! నమస్తె డాక్టర్. ఆఁ రాజారావుగారు నీకు తెలుసా ?

పర : ఆఁ... ఆఁ... అది కాదండి.

భాస్క : రాజారావుగారి అమ్మాయికి మేం ప్రజన్ టేషన్ యిస్తుంటే అది చదివించి రావటానికి సె కెందుకయ్యా భయం.

డాక్టర్ : ఏంభాస్కర్ బిజినెస్ ఎలా ఉంది?

భాస్క : (కొంచెము సంతోషముగా) పర్వాలేదంకి (భార్యని) నాన్నగారు రాలేదా ?

సరో : రాలేదండి.

భాస్క : బయల్దేరారె! మధ్యలో ఎక్కడి కయినా వెళ్ళేరేమో?

డాక్టర్ : వస్తానండి, నాన్నగారు రేపు రమ్మన్నారుటు.

సరో : కాఫీ తీసుకుని వెళ్ళండి డాక్టర్‌గారు.

భాస్క : అవునండి తీసుకోండి (సరోజ లోనికిపోవును) మిమ్మల్ని అనవసరంగా శ్రమ పెట్టవలసి వచ్చింది.

డాక్టర్ : యిందులో శ్రమేముంది లెండి.

సరో : (ట్రేతోవచ్చి) కాఫీతీసుకోండి. (యిచ్చి భాస్కర్ని) మీరు కూడ తీసుకోండి.

భాస్క : నాకిప్పుడొద్దు, మనమేనేజర్ కివ్వు.

సరో : తీసుకోండి (అని మేనేజర్‌కిస్తుంది.)

డాక్టర్ : (లేచి) వస్తాను భాస్కర్, వస్తాను;సరోజ. ముఖ్యంగా మీ నాన్నగార్ని యికనుంచయినా కదలొద్దని చెప్పండి.

భాస్క : అలాగె (డాక్టర్ వెడతాడు. సరోజ అకేచూస్తూఉంది) రా సరోజ. ఉండవయ్యా వస్తాను (అని యిద్దరు లోనికి పోతారు)

పర : నాలుగొందలు ఆయన దగ్గరనుంచి అప్పసంగా తీసుకొన్నానె: సరె తీసుకున్నానే అనుకో, తీరా అడిగితే మనదగ్గర చిల్లి

గవ్వకూడా లేదు. కొంపతీసి మళ్ళీ నాపిల్లల మొఖం చూడకుండా చేస్తారేమో ! (అని ఆలోచించి) ఊఁ నాలుగొందలిచ్చి దెబ్బలు తప్పుకునేబదులు వేషం మార్చి వెడితేసరి, అదిగాక రాత్రిపూటాయె (ఆలోచనగా) లేకపోతే యిచ్చానని ఈ ప్రజంటేషన్ కూడా ఉంచుకుంటె (ఆలోచనగా) అయ్యబాబోయ్ ఉద్యోగం ఊడుతుంది, వద్దు.

(అని చెంపలేసుకుంటాడు)

భాస్క : (కవరుయిస్తూ) యిదిగో, నాన్నగారు పంపారని యిచ్చిరా.

పర : (చెయ్యి వణకుతూ తీసుకుంటాడు) అలాగేబాబు.

భాస్క : త్వరగా వెళ్ళు (అని కూర్చుంటాడు)

పర : (స్టేజి చివరకెళ్ళి మెల్లగా) కవరు బరువుగానే ఉందే ! (అని వెళ్ళిపోవును. యింతలో పోష్టు వస్తుంది.)

భాస్క : (కవర్లు ఉత్తరాలు తీసుకొని ఒకొక్కటిచూస్తూ) ఏమిటి ! అబద్దాల కంపెనీనుంచా (మరొక లెటరుతీసి) ఊ. టి. ది భాస్కర్ (యింకా ఉత్తరాలు తిరగవేసి) ఆర్ సరోజ. ఎవరబ్బా లెటర్సు తెగ రాసేస్తున్నారు. (యింతలో సుబ్బన్న కాఫీ ట్రేతీసి వెడతాడు ) యిదిగో సుబ్బన్నా ఈ కవరు మీఅమ్మగార్కివ్వు. (యిస్తాడు)

సుబ్బ : అలాగే బాబు. (అని కవరు తీసి వెడతాడు)

భాస్క : (ఉత్తరాలు రెండు నోట్లో చదువుకొని ఏదో సంతోషంగా ఉంటాడు. యింతలో నారాయణరావు ప్రవేశం)

నారా : ఏరా నాకు లెటర్సు వచ్చినవా ?

భాస్క : వచ్చాయి నాన్నా, ఇవిగోనండి (అని రెండు ఉత్తరాలు యిచ్చి లోపలికి పోవును.)

నారా : (ఒక కవరు చించి) గౌరవనీయులైన నారాయణరావు గార్కి నమస్కరించి రావ్‌బహదూర్ వ్రాయునది. ఇక్కడ క్షేమము. మీరు అంతేనని తలుస్తున్నాను.

ముఖ్యముగా ఏమిటంటే మాగ్లాన్ లేబరేటరీ నాల్గవ వార్షికోత్సవము 4-9-64 జరుగును గాన మీరందరూ తప్పక రావాలని కోరుతూ ముగిస్తున్నాను,

ఇట్లు రావ్ బహదూర్

(చదివి సంతోషముగా లోపలికి వెళ్ళును.)

(లైట్లు ఆర్పివేయాలి.)

సుబ్బ: (ప్రవేశించి) రాత్రంతా జ్వరం తగిలినట్టుగా ఉంది. ఈరోజు కొత్త కషాయం పెట్టుకుంటే రైటు. ఊఁ అబ్బ సలిగా ఉంది. (వణుకుతూ ఉంటాడు, సరోజ ప్రవేశం)

సరో: (వచ్చి) సుబ్బన్నా ఈవేళ పూజకు తోటలో పూలు కోసుకొస్తావ్ (సుబ్బన్న వంక చూస్తుంది. సుబ్బన్న వణుకుతూ మూలుగుతాడు.) ఏమిటి సుబ్బన్నా అలా వణుకుతున్నావ్ ?

సుబ్బ: ఏం లేదు అమ్మగోరు (అని మూలుగుతాడు)

సరో: ఏమిటి అలా బాధపడుతూ ఏం లేదంటావ్ (అని దగ్గర కెళ్ళి నుదుటిమీద చెయ్యిపెట్టి) అబ్బ! జ్వరం బాగా వచ్చింది, ఏమిటి సుబ్బన్న చెప్పలేదు.

సుబ్బ: రాత్రంతా ఉంది అమ్మగోరు.

సరో: అయితే తెల్లారి పను లెవరు చేయమన్నారు? అయ్యో పాపం, డాక్టరుగారు ఈ పూట వస్తారనుకుంటాను. రానీ, మందు యిప్పిస్తాను.

సుబ్బ: వద్దు అమ్మగోరు కషాయం పెట్టుకు తాగుతాను. నాకు మందు అలవాటు లేదు.

సరో: కషాయం ఏమిటి పాడు. డాక్టర్‌గారితో మంచి బిళ్ళలు యిప్పిస్తాను. ఒక్క రోజులో తగ్గిపోతుంది. కాఫీ త్రాగావా ?

సుబ్బ : లేదమ్మగోరు (వణుకుతూ)

సరో : అయ్యో! రా కాఫీ త్రాగి దుప్పటి కప్పుకుందువుగాని, పాపం వణికిపోతున్నావు (యిద్దరు లోపలికి పోతారు)

భాస్క : (క్రాపు సవరించుకొంటూ వచ్చి నిలబడి పేపరు చూస్తూ) సుబ్బన్నా ?

సరో : (వచ్చి) ఏమిటండీ ?

భాస్క : సరోజా నా బ్యాగ్ యిలా యివ్వు (పేపరు చూస్తూ)

సరో : (తిరిగివచ్చి) యిదిగోండి.

భాస్క : (బ్యాగ్ తీసుకొని) సుబ్బన్న ఏడి కనిపించడు ?

సరో : పాపం వెనుక గదిలో పడుకున్నాడు, జ్వరం వచ్చింది.

భాస్క : ఆఁ! అయితే డాక్టర్‌గారు ఈవేళ వస్తారుగా చూపించు.

సరో : అలాగేనండి. (భాస్కర్ వెళ్ళును. సరోజ పేపరు చూస్తుంది.)

నారా : (వస్తూ) భాస్కర్ ఏడి ? వెళ్లాడా ఆఫీసుకి ?

సరో : అరుగో యిప్పుడే వెళ్ళారు మావయ్యా.

నారా : డాక్టరుగారు వస్తే రైటు, యింజక్షను చేయించుకొని బయటకు వెళ్ళిరావాలి.

సరో : డాక్టరుగారు ఈసారి ఎప్పుడూ బయటు వెళ్ళొద్దన్నారు.

నారా : అన్నారూ! సరే (సరోజ లోపలికి పోతుంది. పేపరు చూస్తుంటాడు.)

డాక్ట : (వచ్చి) నమస్తే నారాయణరావుగారు ?

నారా : నమస్తే కూర్చోండి డాక్టరుగారు.

డాక్ట : వంట్లో ఎలా ఉందండి ?

నారా : ఫర్వాలేదు కులాసాగా ఉన్నాను. యింకా యింజక్షను కావాలంటారా ?

డాక్ట : యిక ఈరోజుతో చాలిస్తాను. రోజూ టానిక్ త్రాగుతూ బిళ్ళలుకూడ వేసుకోండి. ఏది కొద్దిగా వేడినీళ్ళు తెప్పించండి.

నారా : అమ్మాయ్ సరోజా, డాక్టర్‌గారొచ్చారు, కాసిని వేడినీళ్ళు పట్రామ్మా. నిన్న యేదో అర్జంటు పని ఉండటం వలన వెళ్ళాను. మిమ్మల్ని అనవసరంగా శ్రమపెట్టాను.

డాక్ట : దానిదేముంది లెండి! మళ్ళీ బి. పి. వస్తుందని భయం.

సరో : (గ్లాసు వాటర్‌తో వచ్చి) నమస్తే డాక్టర్‌గారు.

డాక్ట : నమస్తే.

సరో : మన సుబ్బన్నను చూపించండి మావయ్యగారు.

నారా : అవును పిలువమ్మా. (డాక్టర్ యింజక్షన్ రెడీ చేస్తాడు.)

సరో : (ద్వారం వద్దకు వెళ్ళి) సుబ్బన్నా! సుబ్బన్నా! యిలారా?

డాక్ట : నారాయణరావుగారు మీరు కళ్ళుమూసుకొని కుర్చీకి ఆనుకోండి. యింజక్షను కొంచెం మగతగా ఉంటుంది. (యింజక్షన్ చేస్తాడు, నారాయణరావు మగతగా ఉంటాడు.)

సుబ్బ : (వణుకుతూ దుప్పటి కప్పుకొని) నమస్కారం బాబుగోరు. సలిజ్వరం సంపేత్తుందండి.

డాక్ట : ఎప్పటి నుంచోయ్? యిలారా

సుబ్బ : నిన్నటి నుంచి దొరగోరు.

డాక్ట : (పరీక్ష చేసి) యింజక్షన్ యిస్తాను, తగ్గిపోతుందిలే.

సుబ్బ : అమ్మో! నాకు మందేదైనా యివ్వండి బాబుగోరు, సూదంటే మా సెడ్డ భయం బాబుగోరు.

సరో : చేయించుకో సుబ్బన్నా, తగ్గొద్దు! చెయ్యండి డాక్టరుగారు. (అని లోపలికి పోవును.)

డాక్ట : (కూర్చుని సుబ్బన్నకి యింజక్షన్ చేస్తాడు. సుబ్బన్న లోపలికి పోతాడు.)

సరో : (వేడినీరు, తువ్వాల, సబ్బు తెచ్చి) డాక్టర్‌గారు హాండ్స్ వాష్ చేసుకోండి,

డాక్ట : (డాక్టర్ లేచి చేతులు కడుగుతూ ఉంటాడు. సరోజ నీళ్ళు పోస్తుంది. సరోజ టవల్ యిచ్చి లోనికిపోతుంది. డాక్టరు చేతులు తుడుస్తూ వచ్చి కూర్చుంటాడు.)

సరో : (వచ్చి) కాఫీ తీసుకోండి డాక్టరుగారు.

డాక్ట : ఊఁ తప్పుతుందా ? (కాఫీ తీసుకుంటాడు) సరోజా ఒక శుభ వార్త. మీ అన్నయ్య యేదో బిజినెస్ పెడతాడంట. త్రాగుడు కూడ యించుమించు మానేసినట్లేనట.

సరో : (సంతోషముగా) ఆఁ అన్నయ్య త్రాగుడు మానేశాడా ?

డాక్ట : కారణమేమిటో తెలుసా ? యిలారా చెపుతా. (అని యేదో చెపుతాడు)

సరో : (సిగ్గుతో) పోండి డాక్టర్‌గారు (యిద్దరు నవ్వుతారు. యింతలో భాస్కర్ షడన్‌గా వస్తాడు)

భాస్క : హలో గుడ్‌మార్నింగ్ డాక్టర్! ఎప్పుడొచ్చారు ?

డాక్ట : యిప్పుడే వచ్చాను. భాస్కర్, ఇక మీ నాన్నగార్కి యింజక్షన్స్ అవసరం లేదు.

భాస్క : (తండ్రివంక చూసి, ఆశ్చర్యంగా) నాన్నగారేమిటి అలా ఉన్నారు ?

డాక్ట : ఏం లేదు. యింజక్షన్ కొంచెం మగతగా ఉంటుంది. రెండు మూడు నిమిషాల్లో మగత విడిపోతుంది.

భాస్క : (తల పంకించి) సరోజా మన సుబ్బన్నని చూపించావా ?

సరో : ఆఁ! చూశారండి.

డాక్ట : ఆతనికి యింజక్షన్ యిచ్చాను. అదేం చేయదు. చూడు సరోజ, ఈవేళ భోజనం వద్దు. కాఫీ యివ్వు. (నారాయణ రావు దగ్గరకెళ్ళి) నారాయణరావుగారూ, ఏమండీ.

నారా : (మగతగా) ఊఁ ఏమిటీ ?

డాక్ట : ఇక నేవస్తాను. బాగుందిగా ?

నారా : వెళ్ళిరండి, ఫర్వాలేదు.

డాక్ట : వస్తాను భాస్కర్ ! వస్తాను సరోజ. అవసరమయితే తెలియ పర్చండి వస్తాను. (అని వెళ్ళును)

భాస్క : సరోజా నా కోసం రామారావుగా రొచ్చారా ?

సరో : రాలేదండి.

నారా : అమ్మాయ్ నాకు భోజనం వడ్డించు, ఆకలేస్తుంది,

సరో : (లోపలికి వెడుతూ) మీరూ రండి.

నారా : ఏరా బీరువాలో ఎలక్ట్రిక్ ఫైల్ కనిపించడం లేదేంటి ?

భాస్క : అక్కడే ఉండాలి. నిన్న చూశాను. (అంటూ లోపలికి పోవును. తరువాత నారాయణరావు కూడ పోవును. పరమానందం ప్రవేశం)

పర : ఎవరూ లేరే ! (అని కూర్చుంటాడు) కొంపతీసి (చెంప సవ రించుకుంటూ) ఈ బొబ్బలు చూడరుకదా ! (జేబురుమాలతో నొక్కి మరల పేపరు చూస్తుంటాడు)

భాస్క : (వచ్చి) ఏమయ్యా ఎప్పుడొచ్చావు ?

పర : రాత్రి వచ్చాను సార్ (అని ఒక ప్రక్కగా ఉంటాడు)

భాస్క : ఊఁ ఎలా ఉంది ? పెళ్ళి బాగా జరిగిందా ?

పర : ఆహాఁ ! బ్రహ్మాండంగా ఒరిగిందనుకోండి. అబ్బ ! ఆ పెళ్ళి కొచ్చారర్ సార్, జనం లెక్క పెట్టలేం అనుకోండి.

భాస్క : ఏమన్నారు ఆ రాజారావుగారు? బాగా గౌరవించారా ? మేం రాలేదని అడిగారా ?

పర : (చెంప నొక్కుకొని) అబ్బ చాలా బాగా గౌరవించారు. ప్రత్యే కంగా నన్ను ఒక రూంలోకి తీసికెళ్ళి, మీరు రాలేదని అడిగి నాకు బాగా పెట్టిపంపించారు.

భాస్క : అది సరేకాని, ఈ బిల్స్ రెడీచేయి. సరోజా! సరోజా నా డ్రాయరు మీద గ్రీన్ ఎకౌంట్ బుక్ తీసుకురా. ఆబుక్ ఆఫీ సుకుతీసికెళ్ళి రెండురోజులలో రెడీచేయాలి.

సరో : (బుక్‌తో వచ్చి) ఇదుగోండి ఇదేనా ?

భాస్క : ఊఁ ఇదే ఇదిగోవయ్యా (అని మేనేజర్ కిచ్చును.

పర : (దెబ్బ మర్చిపోయి రెండు చేతులతో తీసుకొంటాడు.)

భాస్క : (ముఖం వంక చూసి) ఏమిటయ్యా ఇవివాతల్లాగా వున్నవి. అరె ఐదు వేళ్ళులాగా ఉన్నవి. (సరోజకూడ కొంచెము దగ్గరకొచ్చి చూస్తుంది)

పర : (తటపటాయించి) అబ్బే రాత్రి నిద్రలో దోమవాలి కుట్టే స్తుంది. నిన్నేమి చేస్తానో చూడని, నా చేత్తోనే నాబలం కొద్దీ చరిచా. ఇంకేముంది దోమపోయి దెబ్బతేలింది.

భాస్క : అంతేనా ఎవరన్నా ... ...

పర : ఎవరన్నా అయితే ఇక మీకు కనిపిస్తానా ? వాడో నేనో సఫా అవ్వాలి (భాస్కర్, సరోజ నవ్వుతారు)

బాస్క : సరే వెళ్ళు.

పర : అలాగే సార్ (అని వెడుతూ వెనక్కువచ్చి) బాస్కర్‌బాబు ఇంట్లో ఇబ్బందిగా ఉంది. ఒక వందరూపాయలు ......

భాస్క : మొన్ననేగా జీతం తీసుకుంది.

పర : మొన్న మా చిన్నమనుమడి వడుగు. దానికి ఉన్నదంతా ఖర్చ యింది.

భాస్క : ఏదో చెప్పుతావ్. ఇదిగో వంద. వెళ్ళి త్వరగా అఫీసుకు రా? (అని వంద యిస్తాడు)

పర : (తీసుకొని) థాంక్స్అండి. నమస్కారం వస్తాను. నమస్తే సరోజ మ్మగారు.

సరో : (నవ్వుతూ) నమస్తే (మేనేజర్ వెళ్ళును. నొసలు చిట్లించి) ఈ మేనెజరు బిల్స్ కరెక్టుగా వ్రాస్తాడండీ?

భాస్క : (నవ్వుతూ) ఏం నీకింత అనుమానం వచ్చింది.

సరో : అఁహాఁ మాటలు ఎప్పుడూ తడబడతాడు

భాస్క : అతను ఎప్పుడు అంతే. చాలాక్లవర్ హెడ్. ఒకొక్కసారి

నాన్నగార్కే సలహాలిచ్చేవాడట. అదీగాక ఆఫీసులో అడక్కుండా నయాపైస తీసుకోడు. కాని కొంచెం పిరికి ఉంది.

సరో : అది అందరికి ఉంటుందనుకోండి. (యిద్దరూ నవ్వుతారు)

(ఇంతలో రామారావు ప్రవేశం)

రామా : హలో భాస్కర్ (సరోజ లోపలికి పోవును)

భాస్క : రండి రామారావుగారు కూర్చోండి.

రామా : రెడీగా ఉన్నారన్నమాట, వెడదామా ?

భాస్క : Just one minit ఇప్పుడే వస్తాను. (అనిలోపలికిపోవును) కాఫీ తీసుకోండి.

రామా : వద్దు, ఇప్పుడే తాగి వస్తున్నాను. (రామారావు అక్కడ పేపరు చూస్తూ వుంటాడు. ఇంతలో నారాయణరావు ప్రవేశం.)

నారా : ఏమిటి రామారావ్, ఎలా ఉంది మిషన్? బాగా వర్కు చేస్తుందా ?

రామా : ఇప్పుడు పర్వాలేదండి, బాగానే వర్కు చేస్తోంది. పోయిన నెలలో మిషన్ సరిగ్గా వర్కు చేయకపోవటం వలన చాలా పని ఆగిపోయింది.

నారా : మావాడా క్రొత్తవాడు. ఇవన్నీ నీవు మొట్టమొదట చూచుకోవలసింది నాకేమో రక్తపోటు ఎక్కువయింది. కదలొద్దని డాక్టర్ చెప్పాడు.

రామా : ఇకనుంచి జాగ్రత్తపడతామనుకోండి (భాస్కర్‌వస్తాడు)

భాస్కర్ : ఆఁ వెడదామా రామారావుగారు? వస్తాం నాన్నా!

రామా : ఆ... వస్తాం నారాయణరావుగారు (అనియిద్దరుపోతారు)

నారా : నేనుకూడ కంపెనీకి వెళ్ళి మిషన్ చూస్తే బాగుంటుందనుకుంటూ (అని లోనికి పోవును)

సుబ్బ : (ప్రవేశించి) రాత్రి హాయిగా నిద్రపట్టింది. తస్కదీయ (డ్రాయరు తుడుస్తూ) ఒక సూదితోనే సలిజ్వరం తగ్గిపోయింది. పనిమనిసనే బేదం లేకుండ బుల్లెమ్మగోరు గులుకోసు నీళ్ళు అని యిచ్చి ఎంతబాగా సూశారు! చినబాబుగోరు చెప్పినట్టుగా పేదలంటే మహా యిష్టం బుల్లెమ్మగోర్కి.

సరో : (వచ్చి) ఏమిటి సుబ్బన్నా కాఫీ త్రాగలేదేం ?

సుబ్బ : తాగుతానులె అమ్మగోరు.

సరో : యింకెప్పుడు ? పదయింది; పాపం నీరసంగా ఉండదు.

సుబ్బ : సరే నమ్మగోరు. యియన్నీ తుడిసీవత్తా, లేకపోతె పెద్దయ్యగోరు వచ్చి కూక లెడతారు.

సరో : ఈ వేళ పని చెయ్యకపోతే విశ్రాంతి తీసుకోగూడదు?

సుబ్బ : వంట్లో బాగుండప్పుడు సేత్తే ఏం అమ్మాగోరు.

సరో : సరేలే కాఫీ త్రాగివచ్చి తుడువు. (సుబ్బన్న లోనికి పోతాడు సరోజ పేపరు చూస్తున్నది)

నారా : (వచ్చి) అమ్మాయ్ సరోజా, నేను కొంచెం నెమ్మదిగా కంపెనీ కెళ్ళి మిషన్ చూసి వస్తాను.

సరో : మావయ్యా ! దయచేసి వద్దండి. డాక్టర్‌గారు కదిలితే రక్తపోటు ఎక్కువ అవుతుందన్నారు.

నారా : కాదమ్మా, ఈ వేళ డాక్టరుగారు మన కంపెనీ చూద్దామని వస్తున్నారట. అబ్బాయి, రామారావు అక్కడలేరు ఫంక్షన్ కెళ్ళారు. నేనన్నా వెళ్ళకపోతే బాగోదు, అదిగాక మిషన్ రిపేర్ చేయించారు. యిప్పుడెలా వుందో చూడాలి. అబ్బాయి వస్తే ఈ సంగతి చెప్పు.

సరో : మీ అబ్బాయి గారు చూపెడతారు లెండి, మీరు వెళ్ళకండి.

నారా : డాక్టర్ గారూ అబ్బాయినే చూపెట్టమని కోరారు. కాని నాకేమో నేనె చూపెట్టాలని ఉంది.

సరో : వద్దండి మావయ్యా, ఏమిటో నాకు భయంగా ఉంది. కుడి కన్ను అదురుతుంది.

నారా : ఎందుకమ్మా భయం. డాక్టర్‌గారున్నారుగా. వచ్చే టప్పుడు రాయమ్మకే వారినికూడ తీసుకొస్తాను.

సరో : సరే మీ యిష్టం. జాగ్రత్త మావయ్యగారు.

నారా : అలాగె (అని వెళ్ళును. 'సరోజ లోపలికి పోవును.)

(యింతలో భాస్కర్ చిన్న ప్యాకెట్ తీసుకొనివస్తాడు)

భాస్క : సరోజ! సరోజా!

సరో : (వచ్చి) ఏమిటండీ?......

భాస్క : (ప్యాకెట్ వెనకాల పెట్టి) నీకో ప్రజంట్ తెచ్చాను. యిది ఏమిటో కనుక్కో ?

సరో : ఏమిటో ఇవ్వండి, చూసి చెపుతాను.

భాస్క : ఆఁహాఁచూసి నువ్వు చెప్పేదేమిటి ?

సరో : సరే మొదటి అక్షరం, చివరి అక్షరం చెప్పండి.

భాస్క : సరే లా ...... ట్.

సరో : (ఆలోచించి రెండుమూడు పేర్లు చిలిపిగా) ఏమో నాకు తెలి యదు చెప్పండి.

భాస్క : అయితే కళ్ళు మూసుకో ...

సరో : ఊఁ (అని కళ్ళు సగం మూస్తుంది.)

భాస్క : (ప్యాకెట్ తీస్తూ) ఊఁ చూస్తున్నావ్.

సరో : అబ్బా లేదులెండి. (రెండుకళ్ళు మూయును.)

భాస్క : (లాకెట్ తీసి మెళ్లో పెడతాడు) ఊఁ యిప్పుడు తెరువ్.

సరో : (కళ్ళు తెరచి మెళ్లో చూచుకొని) ఆఁ ... ... బలేగుందండి. లాకెట్ ఎక్కడిదండి.

భాస్క : యిది చాలా రోజులయింది అర్డర్ యిచ్చి. యిప్పుడు ఫంక్షన్ నించివస్తూ తీసుకొస్తున్నా. దాన్లో ఏమున్నాయో తెలుసా (అని బిరడాతీసి)యిదిగో నీ ఫొటో నాఫోటో వేయించాను!

సరో : (మిక్కిలి సంతోషంగా) అబ్బ ఎంతబాగుంది.

భాస్క : అయితే నువ్వేం ప్రయిజిస్తావు.

సరో : నేనా (ఆలోచిస్తుంది. యింతలో పోస్టు కవర్లు వస్తవి)

సుబ్బ : (లోపలనుంచి గట్టిగా) బుల్లెమ్మగోరు...... బుల్లెమ్మగోరు త్వరగా రండి. (సరోజ హడావిడిగా వెడుతుంది)

భాస్క : (ఉత్తరాలతో ఇటు చూసేటప్పటికి సరోజ ఉండదు. సరె ఈ లోపల ఉత్తరాలు చూద్దామనుకున్నట్లుగా ఉత్తరాలు చూస్తాడు) రావి నారాయణరావుగారు, ఆర్. భాస్కర్ యిండస్ట్రియలు కంపెని. ఆర్. సరోజ. ఎవరబ్బా ఈ అమ్మాయ్! ఉత్తరాలు తెగరాసేస్తుంది. ఏం వ్రాసిందో చూద్దాం. (అని కవరు చించి చదువుతాడు. పోను పోను సీరియస్‌గా చదువుతాడు)

ప్రియమైన సరోజ నిన్ను మనస్సులో తలచుకునే ఆనందం పొందుతాను, నేను మొన్న వచ్చేటప్పుడు చెప్పిన మాటలు మర్చిపోవద్దు. ఈ సారి భాస్కరరావు క్యాంపుకు వెడతాడని చెప్పినావు. వెడితే వెంటనే నాకు తెలియపర్చాలి. మన ప్లాను త్వరలో విజయం పొందాలి. నీ మామగారి ఆరోగ్యం బాగుండటం వలన నేను రావటానికి వీలులేదు. జాగ్రత్త. భాస్కర్ దృష్టిలో నేను అప్పుడిగానే వుండాలి,

ఇట్లు,

డా॥ నీ రఘు.

(చదివి అలా నిశ్చేష్టుడై కూర్చుంటాడు. తెర వెనుక సరోజ డాక్టరు మాటలు)—

సరో : కాఫీ తీసుకోండి డాక్టర్.

డాక్ట : కాఫీ మట్టురు మర్చిపోవు. నీవు తయారుచేసినకాఫీ ఎంతో తేస్టుగా వుంటుంది. ఎక్స్‌పీరియన్స్ హొటల్ కుక్స్‌కూడ తయారుచేయలేరు.

సరో : పోండి డాక్టర్‌గారు, మీరు మరీను.

భాస్క : గుడ్‌మోర్నింగ్ డాక్టర్.

డాక్టర్ : హలో గుడ్‌మోర్నింగ్.

భాస్క : ఆఁ! డాక్టర్! ఏమిటి? నాన్నగారు యిలావున్నారు?

డాక్ట : ఏం లేదు. యింజక్షన్ కొంచెం మత్తుగా వుంటుంది. రెండు నిమిషాల్లో తెలివస్తుంది. నారాయణరావుగారూ! ఏమండీ!

నారా : (నెమ్మదిగా) ఊఁ, ఏమిటి?

డాక్ట : ఇక నే వస్తాను భాస్కర్, వస్తాను సరోజా.

సరో : నమస్తే.

భాస్క : (పళ్ళు బిగించి) డాక్టర్ ఎంత మోసం చేశావు! (బిగ్గరగా) సరోజా! సరోజా!

సరో : (నవ్వుతూ) అబ్బ! వస్తున్నానండీ! సుబ్బన్న స్టవ్ వెలిగించి స్పిరిట్ సీసా పక్కన పెట్టాడు. అది అంటుకుని మంటలు లేస్తే కంగారుపడి పిలిస్తే, వెళ్ళా.

భాస్క : (కోపంగా) సరోజా? ఎన్నాళ్ళనుంచి ఈ నాటకం?

సరో : (ఆశ్చర్యంతో) ఏమిటండి?

భాస్క : ఏమిటా, యిదిగో నీ ప్రియుడు వ్రాసిన ఉత్తరం. (అని యిస్తాడు.

సరో : (ఉత్తరం తీసుకొని కొంచెం చదివి ఏడుస్తూ) ఆఁ ఏమిటండీ ఇది, నాకు తెలియదండి. భగవంతుని సాక్షిగా నాకు తెలియదండి,

భాస్క : సరోజ! ఎందుకింకా అబద్ధమాడుతావ్. మీ అన్నయ్య స్నేహితుడని, ఈ డాక్టరే కావాలని కోరిందిందుకేనా?

సరో : (ఏడుస్తూ) ఇది నాకు తెలియదండి, ఎవరో చేయాలని చేశారు. నాకు తెలియదండి.

భాస్క : నన్నెంత మోసం చేశావ్ సరోజ.

సరో : మీరు తొందర పడుతున్నారు. నేను ఎప్పుడు అలాంటి పాపిష్టిపని చేయలేదు భాస్కర్ ... చేయలేదు.

భాస్క : అవును తొందర పడ్డాను. చిన్నప్పటినుంచి పెంచి పెద్ద చేసిన తండ్రి మాటకూడ కాదని నిన్ను ప్రేమించి పెళ్ళిచేసుకున్నందుకు నాకుతగినశిక్ష విధించావ్, తగిన శిక్షవిధించావ్.

సరో : (చెవులు మూసి ఏడుస్తూ) అబ్బ నా హృదయంపగిలి దహించుకు పోతుంది, ఆ మాటలు నాదగ్గర చెప్పకండి. మనసారా ప్రేమించి పెళ్ళి చేసుకుని మీరే దైవమని నమ్ముకునిఉన్న నన్నే అపార్థం చేసుకుంటున్నారా?

భాస్క : అవును, మనసారా ప్రేమించింది నా డబ్బును, పెళ్ళిచేసికుంది నన్ను, నీకు దైవము ఆ డాక్టరే.

సరో : ఆ మాటలు అనే బదులు నన్ను ఒక్కసారిగా చంపేయండి. కాని ఆ భయంకర మాటలతో నన్ను చిత్రవధ చేయకండి.

భాస్క : (కోపంగా) అసలు డాక్టర్ నీకా మీ అన్నయ్యకా స్నేహితుడు. అసలెప్పటినుంచి ఈ స్నేహం?

సరో : మాఅన్నయ్య. డాక్టర్ ఒక హాస్టల్లో ఉండి చదువుకున్నారట. రెండు సంవత్సరాలయింది. డాక్టర్ మావూరు వచ్చినప్పుడు మా వదినకు జబ్బుగా ఉంది. మాఅన్నయ్య వదిన్ని చూపెట్టాడు. కాని డాక్టర్ బ్రతకదన్నారు. అన్న కొద్దిరోజులలోనే వదినకన్ను మూసింది. అప్పటి నుంచి అన్నయ్య మనోవేదనతో మంచ మెక్కాడు. ఈ డాక్టరె అన్నయ్యను బ్రతికించాడు,

పాపం డబ్బు లేక పోయినా స్నేహితుడుగా అన్నయ్యను బాగా శ్రద్ధతో చూశారు, అదే అభిమానం. అంతే కాని డాక్టర్‌కు నాకు ఎటువంటి పరిచయం లేదు, భాస్కర్, ఎటు వంటి పరియంలేదు. భగవంతుని సాక్షిగా చెపుతున్నాను. నన్ను నమ్మండి.

భాస్క : పరిచయం లేకపోతే ఉత్తరాలు ఎందుకు రాస్తాడు. తొందరలోనే బయటపడ్డాను. లేకపోతే నాకూ, నాన్నకూ ఏ విషమో యిచ్చి చంపేసేవాళ్ళుకూడ. యిక నీ ముఖం చూపించకు వెళ్ళు. తక్షణం వెళ్ళు, వెళ్ళు.

సరో : ఎక్కడికి వెళ్ళనండి? నాకు మీరు తప్ప ఇంకెవరున్నారు?

భాస్క : ఏమో ఎక్కడికి వెడతావో: నా కళ్ళయెదుట వుండటానికి వీల్లేదు. (దగ్గర కెళ్ళి) వెళ్ళు. (అని త్రోసివేయును)

సరో : (కాళ్ళు పుచ్చుకొని ఏడుస్తూ) నేను వెళ్ళలేనండి. మిమ్మల్ని విడిచి వెళ్ళలేను. మీరు చంపండి, నరకండి, మీ కాళ్ళ ముందరే చస్తాను. కాని, నేను వెళ్ళలేను.

సుబ్బ : (బయటకు వచ్చి) బాబూ! చినబాబుగోరు! ఏవిటండీ?

సరో : సుబ్బన్నా! (ఏడుస్తుంది)

సుబ్బ : (ఏడుస్తూ ఆదుర్దాగా) అమ్మా బుల్లెమ్మగోరూ! చినబాబు గోరూ! యిదేం ఘోరంబాబు.

భాస్క : సుబ్బన్నా! నీకు తెలియదు వెళ్ళు. (సరోజనుండి కాళ్ళు విదిలించుకొని) సరే! నేనే వెడతాను. సుబ్బన్నా నా బట్టలు సర్దు.

సుబ్బ : బాబూ!

భాస్క : (కోపంతో) సర్దు సుబ్బన్నా! నిన్నే! (సుబ్బన్న లోపలికి పోతాడు)

సరో : (ఏడుస్తూ) వద్దు. మీ యింట్లోంచి మీరెందు కెళ్ళాలి. సరే నేనే వెడతాను. నా రాత ఎలా రాసుంటే అలా జరుగు

తుంది. (సుబ్బన్న పెట్టి తీసుకొస్తాడు) సుబ్బన్నా, వారిపెట్టె లోపలపెట్టి నా పెట్టె పట్రా.

సుబ్బ : (బాధతో) బుల్లెమ్మగోరు!

సరో : పట్రా సుబ్బన్నా. (సుబ్బన్న లోపలికి పోతాడు) వస్తాను భాస్కర్. కాని ఒక్కకోర్కె. మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూడండి. మీరు నమ్మినా నమ్మకపోయినా ఒక్కమాటుమట్టుకు నిజం, డాక్టర్ని ఎప్పుడూ అభిమానంగానే చూశాను. కాని మీకు, మీ కుటుంబానికి అగౌరవమైన పని ఏమీ చేయ లేదు. నిజం నిలకడమీద మీకే తెలుస్తుంది. మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి. వస్తాను. నమస్తే! (కాళ్ళదగ్గర కూర్చుని (యింతలో సుబ్బన్న పెట్టి తెస్తాడు. అది సరోజ తీసుకొని) వస్తాను సుబ్బన్నా!

సుబ్బ : (ఏడుస్తు) బుల్లెమ్మగోరూ! (సరోజ ఏడుస్తు వెళుతుంది. భాస్కర్ మొఖం తిప్పుకుంటాడు)
(మరల వచ్చి విచారములో నుదుటిమీద చెయ్యివేసి, కూర్చుంటాడు)

భాస్క : (విచారం) సుబ్బన్నా! నాన్నకి విషయం తెలియనీయ వద్దు. రక్తపోటు ఎక్కువ అవుతుంది. వాళ్ళన్నయ్యకు వంట్లో బాగోలేదని టెలిగ్రాం వస్తే వెళ్ళిందను.

సుబ్బ : ఏమిటి బాబు యిదంతా, ఉత్తమ ఇల్లాలుమీద అభాండము.

భాస్క : సుబ్బన్నా! నీకు తెలియదు. మనమనుకున్నంత మంచిది కాదు సరోజ.

సుబ్బ : బాబు పొరబడుతున్నారు. సరోజమ్మగోరు, మీరు ఆఫీసు కెళ్ళినకాడనుంచి మిమ్మల్నే ఎంతో తలుస్తారు. మీ చినబాబు గోరు నా అదృష్టం కొద్ది దొరికారు సుబ్బన్నా! అని పని మని సనే భేదం లేకుండా చెప్పేవారు. మిమ్మల్ని సూడందే బుల్లెమ్మగోరు ఒక్క రోజుకూడా ఉండలేరు.

భాస్క : సుబ్బన్న నీకు తెలియదు ఊరుకో (అని చేతుల్లో మొఖం దాచుకుంటాడు. ఇంతలో పరమానందం ఏడుస్తూ వస్తాడు.)

పర : భాస్కర్‌బాబు! భాస్కర్‌బాబు!

భాస్క : (ఆశ్చర్యంతో) ఏమిటి పరమానందం!

పర : నాన్నగారూ ...... (విచారం)

భాస్క : ఆఁ నాన్నగారు.

పర : (మాట్లాడడు. విచారంగా ఉంటాడు)

భాస్క : ఏమిటయ్యా! నాన్నగార్కి ఏమయింది?

పర : నాన్నగారు, డాక్టర్ రఘుగారు, కార్ఖానా చూస్తున్నారు. చూస్తుండగా తలకు కరంటువైరు తగిలింది. డాక్టర్‌కూడ ఏమీ చేయలేకపోయాడు. ఆ షాక్‌కి అక్కడే ప్రాణంపోయింది బాబు.

భాస్క : ఆఁనాన్నగారు పోయూరా! (అనిబయటుకు పరుగెత్తుతాడు ఎదురుగా స్టేజీమీదకు శవాన్ని తీసుకొస్తారు.)

సుబ్బ : పెదబాబుగోరు పోయూరా? (భాస్కర్ వెనుక పోతాడు: యిద్దరు తీసుకొస్తారు. పడుకోబెట్టి ముసుగు వేయాలి.)

భాస్క : (తండ్రిదగ్గరకూర్చుని ఏడుస్తూ) నాన్నానన్ను ఒంటరివాణ్ని చేసి వెళ్ళిపోయావా నాన్నా; నన్ను పెంచి పెద్దచేసిన మిమ్మల్ని సుఖపెట్టలేకపోయాను నాన్నా. కనీసం మీ మాట ప్రకారం నడుచుకోలేకపోయూను. మీ చివరి కోర్కె వినే అదృష్టం కూడా లేకపోయింది. నన్ను క్షమించండి నాన్నా. (కాళ్ళు పట్టుకొని ఏడుస్తాడు. రామారావు పరుగెత్తుతూ వస్తాడు)

రామ : (ఏడుస్తూ) ఎంతపని చేశారు నారాయణరావుగారు.

భాస్క : రామారావుగారు, నన్ను అనాధని చేసి వెళ్ళిపోయారు. (ఏడుస్తూ)

రామా : (బాధతో) ఊరుకో భాస్కర్, ఊరుకో! దైవ నిర్ణయాన్ని ఎవరు తప్పించగలరు ?

సుబ్బ : (ఏడుస్తూ) పెదబాబుగోరూ! (పరమానందం విచారంతో కళ్ళనీళ్ళు తుడుచుకుంటాడు.)

రామా : (విచారంతో) భాస్కర్, పాపం సరోజ యేది ? (భాస్కర్ ఏడుస్తాడు)

సుబ్బ : వాళ్ళన్నగార్కి జబ్బుగా ఉందని టెలిగ్రాం యిస్తే, వెళ్ళారు బాబు.

[తెరపడును]

5

(ప్రసాదు యిల్లు. 2 కుర్చీలు, డ్రాయరు. ఉంటే రేడియోకూడ పెట్టవచ్చు. వెంకటేశ్వరస్వామి ఫోటో ఉండాలి, దేశనాయకుల ఫోటోలుకూడ. తెర లేచేసరికి సరోజ దిగులుగా కూర్చుని ఉంటుంది.)

సరో : (విచారంతో) అన్నయ్య ఎందుకని ఇంకా రాలేదు. అసలే అన్నయ్యకు ఉద్రేకం ఎక్కువ. అక్కడ ఏం జరిగిందో ఏమో! (ప్రక్కకు మాసేటప్పటికి ప్రసాద్ అదుర్దాగా వస్తాడు. వచ్చి దిగులుగా ఉంటాడు) అడుగో అన్నయ్య ! అన్నయ్యా, వారు ఏమన్నారన్నయ్యా ? వారు కులాసాగా ఉన్నారా ? మామ గారు ఎలా ఉన్నారు ?

ప్రసా : (విచారంగా) నేను వెళ్లేటప్పటికి భాస్కర్ లేదమ్మా, పాపం నీ వచ్చిన రోజునే మీ మామగారు చనిపోయారట.

సరో : ఆఁ !......... (భయంగా)

ప్రసా : భాస్కర్ భోజనం చేయకుండగా, దిగులుతో తిరుగుతున్నాడట. యిదంతా సుబ్బన్న చెప్పాడు.

సరో : (ఏడుస్తూ) అయ్యో ! మామయ్య చనిపోయారా ! అయితే వారెలాగున్నారో, వారి మనస్సు ఎంత బాధపడుతుందో, యే ఆత్మహత్యకు పూనుకుంటారో! నాకు భయమేస్తుందన్నయ్యా. (కొంచెం పిచ్చిగా) వారిని నేను తక్షణం చూడాలి. వారిని చూడకపోతే నేను బ్రతకను. నేను వెడుతున్నా నన్నయ్యా. (అని పిచ్చిగా పరుగెత్తుతుంది)

ప్రసా : అమ్మా, సరోజా ! (అని చేయి పట్టుకుంటాడు)

సరో : నన్ను వదులన్నయ్యా, వారిని చూడాలి. వదులు !

ప్రసా : (గట్టిగా) అమ్మా! సరోజా, వద్దు. నామాట విను, సుబ్బన్న ఉన్నాడు, ఏం ఫరవాలేదు. ఇప్పుడు నీ వెళితే, మరీ ఉద్రిక్తుడై ఆవేశం పొందుతాడమ్మా!

సరో : (విచారంగా) మావగారు ఎలా చనిపోయారట.

ప్రసా : కంపెనీ కార్ఖానా చూద్దామని వెళ్ళారట. అక్కడ కరెంటు వైరు తగిలి చనిపోయారట. అప్పుడు డాక్టరుకూడ ప్రక్కనే ఉన్నారట. కాని వెంటనే చనిపోవటంవలన డాక్టరేమి చేయలేక పోయారట, నీవు, భాస్కర్ విచారపడతారని డాక్టరు మీకు ముఖం చూపించలేకపోయారట. పాపం రెండు రోజులైన తర్వాత వెడితే నీవే ప్రక్కనుండి నన్ను చంపాలని చూశావు. నేను రామారావుగారు ఫంక్షన్‌కి వెళ్లటం వలన మా నాన్నగార్ని చంపావు, అని ఏమేమో అన్నాడట భాస్కర్. యిదంతా సుబ్బన్న చెప్పాడు.

సరో : పాపం డాక్టరుగారి మనస్సు ఎంత బాధపడుతుందో?

ప్రసా : సరోజా భోంచేశావా? (మాట్లాడదు) భోంచేద్దువుగాని రా సరోజా.

సరో : వద్దన్నయ్యా, నాకు ఆకలి కావటం లేదు. నీవు భోంచెయ్యి అన్నయ్యా.

ప్రసా : (బతిమాలుతూ) మొన్న బలత్కారంగా కొంచెం తిన్నావ్. తినమ్మా, ఆరోగ్యం చెడుతుంది. యిక్కడకు అన్నం పెట్టుకురానా?

సరో : వద్దు. నీవు తిను అన్నయ్యా?

ప్రసా : నీవు తినందే నాకు ఆకలి ఉంటుందా అమ్మా, చెప్పు! రామ్మా....

[ తెర పడును ]

(భాస్కర్ తెర లేచేసరికి లాల్చి పైజమాతో విచారంగా కుర్చీమీద చెయ్యి వేసి ఉంటాడు. తర్వాత పాట పాడుతాడు.)

పాట

ప్రియురాలివా నీవు ......
విరహాముతోనె విడిచివెళ్ళిన ప్రియురాలివానీవు ॥
నవ్వు సుఖాలలో నాట్యమాడెడి నవ్య జీవితం
మార్చినావా... మహిమ చీకటిలో ।విరహా॥
ఝుంఝుం ఝుంమ్మని ఝుంకారించెడి
కొదమ తుమ్మెదల కోమల నాథం
మార్చినావా ... ... ఉరుముల మెరుపుల ॥విరహా॥

... ... ... ...

(పాట అయిన తరువాత కుర్చీలో కూర్చుని దిగులుతో చేతుల్లో ముఖం దాచుకుంటాడు. యింతలో సుబ్బన్న వస్తాడు.)

సుబ్బ : ఏంబాబు 5 నెల లయింది, వేళకు భోంచేసి. రెండురోజుల నుంచి అసలే భోంచేయటం లేదు. ఎవరుబాబు ఆఫీసులో డబ్బు దొంగిలించే ముసుగు దొంగ? తేలిందా? పాపం రామారావు గోర్ని చంపాలని పత్తున్నడంట. పాపం, ఆరోజు గండం గడిచింది.

భాస్క : ఎవరో యింకా తేల్లా! పరమానందం ప్రొద్దుట వచ్చాడా నిన్ననగా వెళ్ళాడు, ఇంకా రాలేదు. ఎక్కడికి వెళ్ళినా ఆలస్యమే.

సుబ్బ : రాలేదు బాబు (పరమానందం వస్తాడు)

భాస్క : (ఆదుర్దాగా) ఏం పరమానందం ఏమయింది ?

పర : బిజినెస్ పెట్టినమాట నిజమేనటుండి. డాక్టర్ రఘుగారి పేర బిజినెస్ నడుస్తుందిట. రఘు కార్పొరేషన్ అని ఉందట. దానికి పెట్టుబడి ప్రసాద్ గారిదేనట. ప్రొప్రైటర్ ప్రసాద్ గారేనని అందరూ అంటున్నారు. బిల్డింగ్ కూడ కొని ఎటు తిరిగి 10 రోజులె అయిందట. ఊళ్లో వాళ్ళందరు చెప్పు కుంటున్నారట. అంతడబ్బు ఎక్కడిదని. మరి ఆ డబ్బు లోగడ దాచి ఉంచిందేమో !

భాస్క : (కోపంతో) లోగడ సరిగ్గా బట్టలకే డబ్బు ఉండేదికాదు కాని యిప్పు డెక్కడిది ? యిప్పు డర్థమైంది. ముసుగుదొంగ ఎవరోకాదు. ఆ ప్రసాద్‌గాడే. అప్పుడే నీవు చెప్పినగుర్తుల్ని బట్టి వాడే అనుకున్నాను.

సుబ్బ : బాబు ! నిజం నిలకడమీద తెలుస్తుంది. తొందర పడొద్దు బాబు. రండిబాబు భోంచేదురు గాని.

పర : అవును భాస్కర్ బాబు ! మీరు ఏ బెంగ పెట్టుకోవద్దు.

భాస్క : సరే నీవెళ్ళు (పరమానందం వెళతాడు.) పద సుబ్బన్న.

(అని లోపలికి పోతాడు. సుబ్బన్న కొంచెం సంతో షముతో లోపలికి పోతాడు. తర్వాత ప్రసాద్‌వస్తాడు. పాంట్, క్లాక్ ఖరీదివి వేసుకోవచ్చు. ఎవరూ లేకపోవ టంవలన కొంచెం ఠీగ్గా ఒక దరిన కుర్చీలో కూర్చుం టాడు. ఒక్కసారి నాలుగు ప్రక్కల కలియచూస్తాడు. 2 నిమిషాలు గడిచాక భాస్కర్ వస్తాడు. రాగానే ప్రసాద్ నుంచుంటాడు. భాస్కర్ ప్రసాద్‌ను చూసి ముఖం సీరియస్‌గా ప్రక్కకు తిప్పుకుంటాడు.)

ప్రసా : నమస్తే భాస్కర్ ! (భాస్కర్ మాట్లాడడు. కోపంగా ఉంటాడు) భాస్కర్ ఎన్నిసార్లు ఉత్తరాలు వ్రాసినా జవాబన్నా లేకపోవడం వలన మాచెల్లెలు బాధచెప్పటానికి తరం గాకుండా ఉంది. మా చెల్లి ఏ పాపమూ ఎరుగదు భాస్కర్. అలాంటి నీచపుపనులు మావంశములోనే లేవు బాస్కర్.

భాస్క : ఏం ముసుగువేషం తీసి మంచివేషంలో వచ్చావ్? యిది పగలనా?

ప్రసా : (ఆశ్చర్యంగా) భాస్కర్ ! ఏమిటి నువ్వనేది ?

భాస్క : ఏమిటూ! నీ చెల్లెలు కులట అనుకున్నాను. కాని నీవు దొంగ వని, త్రాగుబోతువని తెలిసింది.

ప్రసా : (ఉద్రేకంతో) భాస్కర్ (అని చేయునెత్తి కొట్టబోతాడు. (తెరవెనుక) 'అన్నయ్యా వారి నేమన్నా అన్నావో నేను సహించలేను. సహించను. (చెల్లిమాట వినపడగానే శాంతించి బాధగా) భాస్కర్ ఏదో అనుమానం నిన్ను పీడిస్తోంది. నిజం నీ కడమీద తెలుస్తుంది. వస్తాను. (అని వెళ్ళిపోతాడు)

భాస్క : (దిగులుగా ఏదో ఆలోచిస్తూ కూర్చుంటాడు. యింతలో రామారావ్ కొంచెం బాధతో వస్తాడు,)

రామా : హలో భాస్కర్ ... ఏమిటి ఇలా ఉన్నావ్ ? ముసుగు దొంగ నన్ను చంపుతాడనా, పర్వాలేదులే. చూడు భాస్కర్ మనం బాధపడేకంటే, త్వరలో ముసుగు దొంగను పట్టలేక పోతే చాలా నష్టపోతాం. నేను ఐ.జికి కూడ ట్రంకాలు చేశాను. యింకెక్కడికి తప్పించుకు పోలేడు, యిదుగో లెటరు కూడ పంపిస్తున్నాను. (అని లెటరు యిస్తాడు.)

భాస్క : (ఉత్తరం తీసి చదువుతాడు) గౌరవనీయులైన ఇన్‌స్పెక్టర్ జనరల్‌గార్కి, అయ్యా మా కనకదుర్గ స్టెయిన్‌లెస్ స్టీల్ ఇండ్రస్ట్రీస్ కంపెనీలో మూడు రాత్రిళ్ళు ముసుగుదొంగలాగ వచ్చి గూర్ఖాని తప్పుకొని, ఉన్న మేనేజర్ని బెదిరించి దాదాపు

అరవైవేల రూపాయలు దొంగిలించాడు. అదీగాక దానికి ప్రొప్రయిటర్స్ రామారావు, భాస్కర్. వారిలో రామారావును అనగా నన్ను చంపాలని ఎంతో ప్రయత్నిస్తున్నాడు. దయచేసి మీరు సి. ఐ. డీ. లను పంపి ఆ ముసుగుదొంగను పట్టి మా ఆపదలను గట్టెక్కించాలని ప్రార్థిస్తున్నాము.

ఇట్లు,

ఇండ్రస్ట్రీస్, పార్టనర్స్.

(చదివి) చాలా బాగుంది. ఈ రోజే పోస్టు చేయించండి (అని కవరు యిస్తాడు.)

రామా : (యింకా నాలుగు కవర్లుఉంటాయి. వాటితో దీనిని కలిపి) త్వరగా ఆఫీసు కెడదాం రెడీ అవు భాస్కర్ ?

భాస్క : నేను కొంచెం ఆగి వస్తాను. (లోపలికి చూసి) సుబ్బన్నా కాఫీ ఒకటి తీసుకురా. (కొంచెం ఆగి) ఈవేళ నా మనస్సు బాగుండలేదు రామారావుగారు.

రామా : (బాధగా) భాస్కర్ దయచేసి ఒకమాట వింటావ్ ?

భాస్క : ఏమిటి చెప్పండి ?

రామా : భాస్కర్ నీవు దిగులుతో సతమతమవుతున్నావ్! యేమిటో, నీలో అగ్నిజ్వాలలు రేగి పరితపించుకు పోతున్నావు. చివరకు నీ అనుమానం తప్ప మిగిలేది లేదు. నా మాట విని సరోజను తప్పకుండా తీసుకురా భాస్కర్.

భాస్క : మళ్ళి మీరు మొదటికొచ్చారు రామారావుగారు. ఆ విషయం మీరు జ్ఞాపకం చేయకండి (సుబ్బన్న కాఫీతో వస్తాడు)

సుబ్బ : (వచ్చి) కాఫీ తీసుకోండి అయ్యగోరు.

రామా : సరే, యెన్ని చెప్పినా విననప్పుడు నేను మట్టుకు ఏం చెయ్యను. (పరమానందం ఆదుర్దాగా వస్తాడు. సుబ్బన్న లోపలికి పోతాడు)

రామా : ఏమిటి పరమానందం ?

పర : అర్జంటుగా ఈ లెటరు మీకుగాని భాస్కర్ బాబుగార్కిగాని యివ్వమన్నారు బాబు.

భాస్క : ఏది చదువు.

పర : (జేబు చూసుకొని) జోడు డ్రాయరుమీద పెట్టి పరుగెత్తుతూ వచ్చాను బాబు.

భాస్క : ఏది (అని లెటరు తీసుకుంటాడు)

రామా : యిదిగో ఈ లెటరు అర్జంటుగా పోస్టుచేసిరా. (పరమానందం వెడతాడు, భాస్కర్ కవరు చించి చదువుతాడు. చదువుతుంటే రామారావు ఆశ్చర్యంగా చూస్తాడు.)

భాస్క : కనకదుర్గా సైకిలెస్టీల్ ఇండస్ట్రీస్ కంపెనీ ప్రొప్రయిటర్స్‌కు, మిష్టర్ రామారావు మీరు ఎంతకాలంనుంచో తప్పించుకుంటున్నారు. మిమ్మల్నిగాని లేక భాస్కర్‌నిగాని రేపటిలోగా హత్య చెయ్యకపోతే నా పనుల్నీ విరమించుకుంటాను.

ఇట్లు

ఆకాశరామన్న

భాస్క : (కోపంతో) రాస్కెల్ ఎవడండీ వీడు? మన కంపెని శత్రువై కూర్చున్నాడు. (అని లెటరు రామారావు కిస్తాడు, యింతలో పరమానందం వస్తాడు)

రామా : (రామారావు చదివి కోపంగా) పరమానందం ఎవరు నీకీ ఉత్తరం యిచ్చింది ?

పర : (కొంచెం భయంతో) ఏమో. పేరు అడగలేదు బాబుగారు.

రామా : ఎలా ఉంటాడు?

పర : ఎవరో ముసలాయనండి ! గడ్డం జుట్టు బాగా పెరిగింది, ఈ లెటరు అర్జంటుగా యివ్వకపోతే మీ ప్రొప్రయిటర్స్‌కు ప్రమాదమని వెళ్ళిపోయారు బాబు.

భాస్క : గుర్తుపట్టగలవా ?

పర : (లేనట్లుగా తలకాయఊపి) అదుర్దాలో సరిగా చూడలేదు బాబు.

భాస్క : ఛీ ఛీ ఏం మనిషివయ్యా.

పర : (తలకాయ వంచుతాడు)

రామా : వీడెవడో మన అలుసు కనుక్కున్నాడు భాస్కర్.

భాస్క : వీణ్ణి నేను వదలిపెట్టను. మీరు జాగ్రత్తగా ఉండండి రామారావుగారు.

రామా : లెటర్ పోస్టు చేశాడుగా సీ. ఐ. డీస్ వస్తేగాని వీడిపని పట్టరు. అందాక మనం జాగ్రత్తగా ఉండాలి.

రామా : (లేచి) సరె నేవస్తాన్ భాస్కర్ ! నీవు త్వరగారావాలి.

భాస్క : అలాగె (రామారావు వెడతాడు.) ఇదిగో పరమానందం నీవు ఎకౌంట్ త్వరగా పూర్తిచెయ్యవయ్యా. ఒక నలుగుర్ని కార్ఖానా మిషన్‌దగ్గర పెట్టించు. రాత్రింబవళ్ళు వ్రాస్తూకూడ ఎకౌంట్ పూర్తి చేయలేకపోయావ్,

పర : (వణుకుతూ) బాబు...ఏదో పిల్లా జల్లా కలవాణ్ణి. రాత్రిళ్ళు ఎకౌంటు వ్రాస్తం మానేస్తాను బాబు.

భాస్క : కార్ఖానా దగ్గర నలుగుర్ని పెడుతున్నాంగా. అయినా నీ కెందుకయ్యా భయం చంపితే, రామారావుగార్ని గాని లేకపోతే నన్నుగాని చంపుతారు. నీకేం భయం ?

పర : ఆఁ ! ......అది కాదు బాబు...

భాస్క : (నుంచుని, నీకేంభయం వద్దు అప్పుడప్పుడు వస్తూఉంటాం, అదీగాక రెండురోజుల్లో సి. ఐ. డీ. లు వస్తారు, ధైర్యంగా ఉండు, వెళ్ళు.

పర : సరేబాబు (అనగానె భాస్కర్ లోపలి కెళ్ళబోతాడు) భాస్కర్ బాబుగారు.

భాస్క : (వెళ్ళేవాడు సైడు ఫోజుతో) ఏమిటి ?

పర : రేపు మామనుమడి పుట్టు వెంట్రుకలు తీస్తున్నాం ! ఏదో రెండు వందలు అడ్వాన్సుగా యిస్తారని ...

భాస్క : రామారావుగారిని అడిగి తీసుకో. యిప్పుడు నాదగ్గరలేదు. (అని లోపలకెళ్ళిపోవును.)

పర : చచ్చానురా బాబు. రామారావు గారి దగ్గర నిన్నే రెండొందలు అడ్వాన్సుగా తీసుకున్నాను. ఆయనకు తెలియకుండగ ఈయన దగ్గర రెండొందలు తీసుకుందామను కుంటె ఆయన మీాదె ఈయన పెట్టాడు. (దిగులుతో) సరే ఏం చేస్తాం ! (వెళ్ళిపోవును)

[తెర పడును]

6

తెర లేచే సరికి బాగా షావుకారి యిల్లులాగా ఉండాలి. సోఫాలు, దేశనాయకుల ఫొటోలు, ప్రత్యేకంగా వెంకటేశ్వరస్వామి ఫొటో ఉండాలి.

సరో : (దిగులుతో పాటుపాడుతూ ఆఖరి వచనం వెంకటేశ్వర స్వామికి నమస్కరిస్తూ పాడాలి. పాట సగమయిన తర్వాత ప్రసాద్ వస్తాడు. పాట వింటూ అతివిచారం చెందుతూ ఉండాలి. అప్పుడాఖరి అక్షరాలు వుందనగా యిటుచూస్తుంది. షడన్‌గా పాట ఆపి అన్నయ్యను చూసి కళ్ళ నీళ్ళు తుడుచుకుంటు లేని సంతోషంతో) అన్నయ్యా వచ్చావా ? వారేమన్నారు?

పాట

అను మానపు కెరటాలకు
ఆహుతాయె నా బ్రతుకు
ఏ విధాన కలతబాసి
ఈజగతి నే మనదాన ||అను||

ప్రేమించిన హృదయాలకు
విధి యొసగిన వర మిదేన
కుమిలిన ఈ జీవితాల
ఆనందము కలువేనా ||||అను||

ప్రసా : (మాట్లాడడు. విచారంతో ఉంటాడు.)

సరో : ఏమిటన్నయ్యా మాట్లాడవు ?

ప్రసా : కనీసం యింట్లోకూడ అడుగు పెట్టనీయలేదు. బయటు వాణ్ణి బయుటే తరిమి వేశాడు, అనరాని మాటలు అన్నాడు, నిన్నుచూసి ఊరుకున్నాను.

సరో : (విచారంగా) అన్నయ్యా, వారు కులాసాగా ఉన్నారా?

ప్రసా : వాడికేం దిగులు దిట్టంగా ఉన్నాడు. మనిషయితేగా దిగులుండటానికి. వాడు ఆస్థి చూచుకొని మిడిసి పడుతున్నాడు. ఆస్థి సంపాదించటం ఒక గొప్ప అనుకుంటున్నాడు. ఎన్నాళ్ళో చూస్తాను.

సరో : (విచారం, కోపంతో) అన్నయ్యా! అలా విసుక్కునే బదులు నన్ను ఒక్కసారి చంపెయ్యరాదు, నీకు ఎటువంటి కష్టము ఉండదు. (అని వెంకటేశ్వరస్వామి ఫోటో దగ్గరకెళ్ళి నమస్కరించి) స్వామీ! యింకా యెన్నాళ్ళు యిలా వుండాలి? ఆపదమొక్కులవాడని బిరుదుపొందేవే! ఈ ఆపద నుండి కాపాడలేవా స్వామీ?

ప్రసా : (బాధతో దగ్గరకెళ్ళి) చెల్లీ! చెల్లీ ఎంతమాట అన్నావు! నేను బ్రతికుందే నీ కోసమమ్మా' నీవులేని జీవితం నాకు వృధా అమ్మా. యింకేమి అనకమ్మా. (అని భుజాలు పుచ్చుకొని) ఊరుకో తల్లీ. (అని తల నిమురుతాడు)

సరో : (విచారంగా) అన్నయ్యా! అయితే నీవు నిన్నటినుంచి అన్నం తినలేదా?

ప్రసా : డాక్టరుగారి ఇంటివద్ద భోంచేశాను.

సరో : ఆయన కులాసాగా ఉన్నారా?

ప్రసా : ఆయన మన మైనింగ్ కంపెనీకి వెళ్ళారట. ఆయా చెప్పింది.

సరో : అన్నయ్యా, బిల్డింగ్ కొంటున్నారటగా. దాదాపు 50 వేల రూపాయల విలువ చేస్తుందట, ఎక్కడదన్నయ్యా యింత డబ్బు. డాక్టర్‌గార్కి ఎక్కువ డబ్బులేదు. అంతా ఫారన్‌కే ఖర్చయిందన్నారు. మనం అంటామా, డాక్టర్ మందుఖర్చు యివ్వలేనివాళ్ళం. ఎక్కడదన్నయ్యా ఈ డబ్బు?

ప్రసా : యిప్పుడు డాక్టర్‌గార్కి కూడ ప్రాక్టీస్ బాగుంది. అదీగాక మన మైనింగ్ కంపెనీ రోజు రోజుకు వృద్ధి అవుతోందమ్మా! యిది నీ అదృష్టమే అనుకుంటా.

సరో : యింత అనుభవం నీ కెక్కడిదన్నయ్యా ?

ప్రసా : డాక్టర్‌గారి సహాయమే నాకు అనుభవం. నీవీ పరిస్థితులలో లేకపోతె మన ఆనందానికి అంతు ఉండేదికాదు సరోజా! సరోజా నీవు రాత్రి భోంచేశావా ? (మాట్లాడదు) లోపల వైపు తిరిగి) ఆ; శాంతమ్మా... శాంతమ్మా...!

సరో : లేదన్నయ్యా !

ప్రసా : ఎక్కడి కెళ్ళింది ?

సరో : ఎందుకన్నయ్యా మనకు పనిమనిషి? మనకి మొదటినుంచి పని మనుషు లున్నారు ఆనుకనా.

ప్రసా : (జాలిగా) పాపం వెళ్ళిపొమ్మన్నావా ? చాలా పేదరాలని, నీకు తోడుగా ఉంటుంది, కొంత మనశ్శాంతి కలుగుతుందని పంపాను.

సరో : పేదరాలైతే ఊరికినే పంపలేదన్నయ్యా! 100 రూపాయలు యిచ్చి ఏమీ అనుకోవద్దని పంపాను. నువ్వు భోంచేద్దువుగాని రా అన్నయ్యా!

ప్రసా : కాదు సరోజ ఈవేళ మనమిద్దరం ఒక్కసారె భోంచెయ్యాలి రామ్మా! అలాగయితే భోంచేస్తా...

సరో : సరే, అలాగె, రా అన్నయ్యా (సరోజ వెడుతుంది. ప్రసాద్ సంతోషముగా వెడతాడు.)

[తెర పడును]

# 7

[తెర లేచేసరికి పరమానందం ఎకౌంటు వ్రాసుకుంటూ మధ్య మధ్యన ఆవులిస్తూ ఉంటాడు. ఒక ప్రక్క బీరువా, అతనికెదురుగా ఎకౌంటు పుస్తకాలు, ప్రక్కన ఫ్లాస్కు)

పర : ఈ ఇన్‌కమ్‌టాక్స్ గొడవలు మూలాన రాత్రిళ్ళు ఎకౌంటు వ్రాయా ల్సొస్తుంది. ఎంత వ్రాసిన పూర్తికావటం లేదు. వెధవ ఉద్యోగం, బ్రతికుంటె బలుసాకు తినొచ్చు. రామారావుగారు ఊళ్లో లేకపోతె వాళ్ళింటికి కూడ మొదలెట్టాట. ఎవడో ఈ ముసుగు దొంగ ఈ వేళ భాస్కర్‌బాబు యింటికేస్తా నన్నాడట. ఈ ముసుగు దొంగ ఎవరో, ఆ ప్రొప్రైటర్స్ యిళ్ళకు ప్లాను వేస్తేరైటు, యిక్కడకు రాకుండగ (అని వ్రాస్తూ కునికిపాట్లు పడతాడు. తనేయాదమర్చి పేపర్ వెయిట్ పడేసు కుంటాడు, ఫడన్‌గా దానికి భయంపొంది డ్రాయర్‌లో పిస్టల్ తీసి నాలుగు ప్రక్కల కలయచూచి తర్వాత పేపర్ వెయిటొంక చూసి ఓస్ యిదా అన్నట్లుగా అభినయం చేయాలి. ఆ పేపర్ వెయిట్ తీసి మళ్ళీ ఫైల్ మీద పెట్టుకొని పిస్టల్ డ్రాయరు మీద పెడతాడు. మళ్ళీ వ్రాస్తం మొదలు పెట్టాలి. తర్వాత వ్రాస్తూనే డ్రాయరు మీద తలవాల్చి కునికిపాట్లు చెందు తాడు. యింతలో ముసుగు దొంగవచ్చి వెనుక నుంచి చూస్తాడు. నెమ్మదిగా వెళ్ళి జేబులో సీసాతీసి వెనుక నుం చుని మేనేజర్ ముక్కు దగ్గర ఆ సీసా పెడతాడు. యింతలో భాస్కర్ ద్వారం దగ్గరకొచ్చి ఉంటాడు. మేనేజర్ మత్తుగా అలాగే పడి నిద్రపోతాడు. దొంగ సొరుగులో తాళాలు తీసి బీరువా దగ్గరకు వెళ్ళబోతాడు. భాస్కర్ వెనుకగా చూస్తాడు. దొంగ బీరువా తాళాలు తీయబోతాడు. భాస్కర్ డ్రాయర్ మీద పిస్టల్ తీసి మెల్లగా దొంగవీపుమీద పిస్టల్ పెట్టి)

భాస్క : ప్రసాద్ ఆగు. కదిలేవో చంపేస్తాన్! ఏం ఈ వేళ నా యింటికేస్తానన్నావటగా! నేను నా యిల్లే జాగ్రత్తగా చూసుకొని అక్కడే ఉంటాననుకొని యిక్కడ కొచ్చావా? నా మీద కచ్చి ఉంటే నన్ను చంపాలికాని పాపం శయనేమిచేశాడు? చెప్పు. ఆ డాక్టర్, నువ్వు చేరి నన్ను సర్వ నాశనం చేయాలనుకున్నారు. నిన్ను బ్రతకనివ్వను. నీ నీడ ఆఖరు. (అని పిస్టల్ మూడుసార్లు పేలుస్తాడు) తర్వాత యిసుగుతో పిస్టల్ వంక చూసి) ఛీ ఛీ (అని పిస్టల్ని ఊపుతాడు.)

దొంగ : (చిన్నగా నవ్వుతూ) ఏం, ఇప్పుడు నిన్ను చంపితే ఎవరు అడ్డువస్తారు?

భాస్క : (దొంగ వెనుకకు చేయి చూపిస్తూ) ఆఁ యిన్‌స్పెక్టర్!

దొంగ : (వెనక్కు తిరిగి చూస్తాడు. యింతలో భాస్కర్ దొంగ పట్టుకున్న పిస్టలు చేయి పట్టుకుంటాడు. యిద్దరూ కలియబడతారు. తర్వాత దొంగ ముసుగు బయటపడుతుంది. అది భాస్కర్ చూసి మిక్కిలి ఆశ్చర్యం పొంది)

భాస్క : ఆఁ రామారావు! నువ్వా! (చేయి వదలి) ఛీ ఎంతపని చేశావు! ప్రాణ స్నేహితుడుగా ఉండి......ఛీ ఛీ (ఇంతలో ప్రసాద్ మెల్లగా వస్తాడు)

రామా : (యింతలో పిస్టల్ భాస్కర్‌కి గురిపెట్టి అవును. నేనే! ఈ రహస్యం తెలియకుండా ఉంటుందనుకున్నాను. కాని, తెలిసింది. యిక నిన్ను బ్రతకనిస్తే లాభం లేదు. (ప్రసాద్ గురిపెట్టాడు) బ్రతకనివ్వను. యిదే నీకు ఆఖరి క్షణం. నీ నీడ ఆఖరు...

ప్రసా : (షడన్‌గా) ఆగు! (అప్పుడు రామారావు అదిరిపోయి వెనక్కు చూడబోతాడు) కదిలావో చంపేస్తాను (కదలకుండగా ఉంటాడు) ఆ పిస్టల్ క్రిందపడేయ్. (పడవేయడు.

బిగ్గరగా) ఊఁ పడేయ్! (రామారావు పిస్టల్ క్రిందపడే స్తాడు. భయంతో ఉంటాడు) యిటు తిరుగు. ఊఁ! (రామా రావు తిరుగుతాడు)
(యింతలో డాక్టర్, సుబ్బన్న, సరోజలు ఆదుర్దాగా భయ ముతో వస్తారు)

భాస్క : (ముఖం ప్రక్కకు త్రిప్పుకుంటాడు)

ప్రసా : మిస్టర్ రామారావు! నారాయణరావుగారి దగ్గర పార్టన రుగా చేరి వారికే ద్రోహం తలపెట్టావా? ఛీ నువ్వింత దుర్మార్గుడవు అనుకోలేము. నిన్నింక ప్రాణాలతో పోనివ్వను. (భాస్కర్ వంక చూసి) భాస్కర్ యిప్పుడు చూశావు కదూ నేరస్తు డెవరో! అకారణంగా నన్ను అనుమానించావ్, నన్ను నేరస్తుడన్నావ్, నన్ను నిందించావు! కాని, భాస్కర్! నిజం నిలకడమీద తేలుతుందంటారు, అందుకు నిదర్శనం నీకళ్ళ ముందే ఉంది. నా చెల్లి విషయంకూడ యిలా ఎందుకుండ కూడదు? (రామారావు కదలబోతాడు) రామారావ్! కది లావో ... ... (భాస్కర్ బాధపడాలి) భాస్కర్ పోలీస్ స్టేష నుకు ఫోన్ చెయ్యి. (భాస్కర్ వెళ్ళబోతాడు) ఇంతలో చెల్లి వంక వెనక్కు తిరిగి చూసి బాధతో) చెల్లీ! నువ్వెందుకు వచ్చావు?

రామా : (యింతలో రామారావు పిస్టల్ లాక్కుని) ప్రాణాలు పోగొట్టుకుంటానికి ... (భాస్కర్ వెనక్కు తిరుగుతాడు. అందరూ ఖంగారుతో ఉంటారు. యింతలో మేనేజరు లేచి)

పర : (బిగ్గరగా) ఆఁ ఏంటది? (రామారావు క్రింద పిస్టలుమీద కాలువేసి అందరికి గురిపెట్టి) హుఁ నన్ను పోలీసులకు పట్టి స్తారు కదూ! యిప్పుడు మీ అందరి ప్రాణాలు తీస్తాను.

ప్రసా : ఎందర్ని చంపుతావ్? ఏం మాటాడవేం? యింతమందిని అన్యాయంగా చంపి నువ్వు మట్టుకు ప్రాణాలతో బ్రతగ్గలవా?

నువ్వంటె భాస్కర్‌కి పంచప్రాణాలు. యిప్పుడు నువ్వు బ్రతికున్నా అతని దృష్టిలో, యిక అందరి దృష్టిలో హంతకుడవే! ఎందుకు ఈ నీచపు బ్రతుకు? పాపం, నిజం చెప్పు? చేసిన పాపానికి అలాగయినా ప్రాయిశ్చిత్తం చేసుకో.

(రామారావు పిస్టల్ తనకల్లే త్రిప్పుకొని గుండెలో ప్రేల్చుకుంటాడు) అబ్బా! (అనగానె అందరూ 'ఆఁ' అని దగ్గర కొస్తారు)

ప్రసా : రామారావ్! (అని బాధపడతాడు)

డాక్ట : అయ్యో, పాపం! (గాయం చూడబోతాడు)

రామా : నన్ను పాపం తలచకండి డాక్టర్! యిక్కడ ఉన్న వాళ్ళందరకీ ద్రోహం చేశాను. భాస్కర్ నన్ను మన్నించు. భాస్కర్ సరోజ ఉత్తమురాలు. డాక్టరు, సరోజలు ఏ పాప మెరుగరు భాస్కర్. నేనే ఉత్తరం కల్పించి వ్రాశాను. తర్వాత రిపేరైన మిషన్ చూస్తానికి మీ నాన్నగారు వస్తారని వైర్ తప్పించి నేనుకూడా నీతో ఫంక్షన్‌కి వచ్చాను. మీ నాన్నగారిని కూడా చంపింది నేనేనని ఎవ్వరికీ ఏమీ తెలియదు. నేను అనేక దుర్వ్యసనాలకు లోనై కంపెనీ డబ్బు, నాడబ్బు ఎంతో నాశనం చేశాను. అందుకే నీ మనస్సుకు అనుమానం కల్గించి పిచ్చివాణ్ణిలాగా చేయాలనుకున్నాను. నీఆస్తి అంతా రాబట్టుకోవాలనుకున్నాను. నన్ను అందరూ మన్నించండి. (అని దండం పెట్టి) భాస్కర్... (అని చనిపోతాడు. అందరూ బాధపడతారు)

ప్రసా : (సరోజను చూసి) సరోజా నువ్వెలాగొచ్చావ్?

సరో : నువ్వు మూడు రోజులనుండి రాకపోయేటప్పటికి నాకేదో భయం వేసి డాక్టరు గారింటికి వచ్చాను. వారు నువ్వే దొంగగా అనుమానించబడ్డావని చెప్పారు. దానితో నాకు మరీ భయంవేసి వారిని రక్షమని ప్రతిమాలాను. డాక్టరు బాధ పడి వచ్చారు. యింతలో యింటివద్ద ఎవరూ లేరు. సుబ్బన్న ఏం జరుగుతుందో భయంగా ఉందన్నాడు. ముగ్గురం కలిసి ఖంగారుగా కారు వేసుకొచ్చాం.

భాస్క : (బాధతో) నన్ను మన్నించు సరోజా.

సరో : అంతమాటనకండి,

భాస్క : నన్ను క్షమించండి డాక్టర్.

డాక్టర్ : ఏమిటి ... ఊరుకో భాస్కర్ ! భాస్కర్ నేనొక చిన్న కథ చెపుతాను విను. "నా స్నేహితుడికి ఒక చెల్లి ఉండేది. ఆ చెల్లిని అతను తన ప్రాణం కన్నాఅధికంగా ప్రేమించే వాడు. ఎప్పుడూ ఆమెతోనే ఆటపాటలు గడిపేవాడు. ఒక రోజు వాళ్ళ తల్లి దండ్రులతో సహా తిరుపతి తిరుణాల కెళ్ళారు. అక్కడ అతని ప్రాణానికి ప్రాణమైన చెల్లి తప్పిపోయింది. (ప్రసాద్ ఆశ్చర్యంగా ఆలోచిస్తాడు) వెంటనే తల్లి, ఆ మనో దతో మరణించింది. మరల కొద్ది కాలంలోనే తండ్రికూడా కాల గమనంలో కలసిపోయారు. పాపం, అతను అప్పటి నుంచి ఏకాకిగా ఉంటూ ఎవరిని చూసినా తన చెల్లిలనే భ్రమపడేవాడు. అది తప్పా భాస్కర్ ?

భాస్క : లేదు డాక్టర్ ... అది తప్పుకాదు.

డాక్ట : (బాధతో) ఆ చెల్లిని పోగొట్టుకుంది ఎవరోకాదు భాస్కర్ నేనే ఆ నిర్భాగ్యుణ్ణి. నేనే.

ప్రసా : (ఆదుర్దాగా) ఆఁ తిరుపతిలోనా ఏసంవత్సరమో చెప్ప గలరా ?

డాక్ట : సరిగ్గా చెప్పలేను. కాని ఆరోజు వైకుంఠ ఏకాదశి, యిప్ప టికి దాదాపు 16 సంవత్సరాలవుతుంది.

ప్రసా : (నెమ్మదిగా) ఆఁ వైకుంఠ ఏకాదశి (ఆదుర్దాగా) వేరే గుర్తు లేమన్నా తెలుసా ?

డాక్ట : తలమీద పాపిడి ఎడం ప్రక్క ఆపరేషన్ చేశారు. చేసి నాలు గయిదు రోజులే అయింది. కుట్లుకూడ విప్పతీయలేదు.

ప్రసా : (బాధగా) డాక్టర్ మీ తప్పిపోయిన చెల్లి ఎవరో కాదు ఈ నా చెల్లి డాక్టర్.

సరో : (ఆశ్చర్యంగా) అన్నయ్యా !

డాక్ట : ఆ ! ప్రసాద్ ఏమిటి ?

భాస్క : ఆఁ! (ఆశ్చర్యంతో చూస్తాడు)

ప్రసా : అవును పాపం కుట్లు కూడ విప్పతీయలేదు. నేనే రాజ మండ్రిలో డాక్టర్ రాజుగారిచేత విప్పతీయించాను. (సరోజ పాపిడి చూపిస్తూ) యిదిగో కుట్లు ఊడతీసినమచ్చ ఆరోజు వైకుంఠ ఏకాదశి ఎంతో అదృష్టం అనుకున్నాను. పేరేమి టంటే బుజ్జి అని చెప్పింది. నా తల్లిపేరు సరోజమ్మ. అందు కని సరోజని పెట్టుకున్నాను.

డాక్ట : ఆఁ చెల్లీ ... సరోజా (అని సరోజ దగ్గర కెడతాడు)

సరో : (బాధతో ప్రసాద్ దగ్గరకెళ్ళి) అయితే నీవు సొంతన్నయ్యవు కావా ?

పసా : (ఉత్సాహంగా) కాదమ్మా! డాక్టర్ గారే నమ్మా నీసొంత న్నయ్య!

డాక్ట : (ఉత్సాహంగా) కాదు, ప్రసాద్ కాదా నీతో బుట్టువే !

సరో : అన్నయ్యా (అని ప్రసాద్‌ను కౌగలించుకొనును.)

ప్రసా : (బాధతో) చెల్లీ (అని తల నిమురుతాడు)

సరో : అన్నయ్యా (అని డాక్టర్‌ని కౌగలించు కొనును,)

డాక్ట : (బాధతో) చెల్లీ (అని తలనిమురుతాడు)

భాస్క : (బాధతో) నేను క్షమించరాని అనుమానాల పాలయ్యాను (ఏడుస్తూ) ఒకరక్తం పంచుకొని పుట్టినవాళ్ళనే అనుమానించానే ... ఛీ...ఛీ... నా పాపానికి పరిహారమే లేదు. (అని డాక్టరు చేతులు పట్టుకుంటాడు.)

డాక్ట : అగు భాస్కర్, తెలియక అలా అనుమానించావ్. దీనిలో పాపమేముంది ? ఎందుకు బాధపడతావు. ఊరుకో, ఊరుకో భాస్కర్.

భాస్క : (ప్రసాదు చేతులు పట్టుకొని) బావా నన్ను క్షమించు· బావా... నన్ను క్షమించు·

ప్రసా : ఊరుకో భాస్కర్, తెలియక చేశావ్.

భాస్క : సరోజా ! (బుజాలు పట్టుకొని) నిన్ను చాలా బాధ పెట్టాను, నన్ను మన్నించు సరోజా.

సరో : అబ్బ... ఊరుకోండీ. అలా అనకూడదు.

పర : చూశావా సుబ్బన్నా...! రామారావు ఎంత నాటకమాడాడు ! పీడ వదిలింది.

సుబ్బ : అవును బాబు మంచిగానే ఉంటారు. లోపల కుట్ర. దుర్మార్గుడు ! మా బుల్లెమ్మగోర్ని కట్టపెట్టాడు.

భాస్క : మ్యానేజర్ ! రేపు మన కంపెనీకి సెలవు యిచ్చేసేయండి.

పర : రేపేమిటండి నాలుగవచ్చింది, యిప్పుడే తగిలిస్తాను.

(పరమానందం శలవు బోర్డు తెచ్చి తగిలిస్తాడు)

డాక్ట : పదండి బావగారూ! అందరం యింటికెళ్ళి సావకాశంగా మాట్లాడు కుందాం (అందరు నిష్క్రమించుదురు)



—: సమాప్తం :—



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B124 |
| పుస్తకం పేరు | ఎవరిది నేరం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI, 8 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |